పోతన భాగవతం నుండి

# మందార మకరందాలు

డా॥సి. నారాయణరెడ్డిగారి మకరంద వ్యాఖ్యానంతో





**కీ॥శే॥ శ్రీమతి కంబాల సుధేష్ణ**
ఉపన్యాస విశారద **కీ॥శే॥ కంబాల కృష్ణమూర్తి** గారల
స్మృతికి నివాళిగా
వారి కుమార్తె **శ్రీమతి కంబాల గంగా భవాని** గారు
(ఆం.ప్ర. మహిళా కాంగ్రెస్ అధ్యక్షులు, ఆం.ప్ర. శాసన మండలి పూర్వ సభ్యురాలు)
అందించిన ఆర్థిక సహాయంతో
ఈ గ్రంథం పునర్ముద్రితం.

# మందార మకరందాలు

(బమ్మెర పోతన భాగవతంలోని కొన్ని పద్య మందారాలకు మకరంద వ్యాఖ్యానం)

వ్యాఖ్యాత:

**డా॥ సి. నారాయణరెడ్డి**

ప్రచురణ:



**యువభారతి**

ఆంధ్ర సారస్వత పరిషత్ భవనములు

తిలక్‌రోడ్, హైదరాబాద్ -500 001

**Mandaara Makarandaalu**
A Commentary by
Dr. C. Narayana Reddy
© Yuva Bharathi
Andhra Saraswatha Parishat Buildings,
Tilak Road, Hyderabad - 500 001.

| | | |
|---|---|---|
| Publication No | : | 17 |
| First Edition | : | 25,000 Copies - 21st October 1973 |
| Second Edition | : | 10,000 Copies - 2nd December 1973 |
| Third Edition | : | 5,000 Copies - 1st April, 1974 |
| Fourth Edition | : | 2,000 Copies - 26th October, 2012 |
| Book Production | : | 'Pustaka Shilpi' - **T.Muralidhar Goud** |
| Cover Concept | : | **Seela Veerraju** |
| Cover Design | : | **T. Mallesh** |
| DTP | : | **Litaracy House (AMS), Hyderabad** |
| For Copies | : | **Yuva Bharathi**<br>Andhra Saraswatha Parishat Building -<br>Tilak Road, Hyderabad - 500 001<br>Cell : 9247 328 440, 9290 702 328<br>and<br>at **all leading book shops** |
| Printed at | : | **Karshak Art Printers**<br>40 APHB - Vidyanagar,<br>Hyderabad - 500 044. |
| Price | : | ₹ 50 $ 5 |



# మా మాట

ఉత్తమ సాహిత్యాధ్యయనం వల్ల వ్యక్తిత్వానికి సమగ్రత చేకూరుతుంది. యువభారతి సాహితీ సాంస్కృతిక సంస్థ సమాజహితం కోసం, సాహిత్య సౌమనస్యం, సౌజన్యం పెంపొందించడానికి ఉడుతాభక్తిగా కృషిచేస్తున్నది. మనిషిలో అంతర్లీనంగా ఉన్న సృజనాత్మక శక్తిని పరివ్యాప్తం చేయడానికి తోడ్పడుతున్నది. సమైక్య భావాలను నిర్మాణాత్మక దృక్పథాలను ప్రోత్సహిస్తున్నది. మంచి కోసం మానవత కోసం ఉద్యమిస్తూ సమకాలిక యువతరంలో నిర్మాణాత్మక దృక్కోణం ఏర్పరచడానికి పలు సాహిత్య కార్యక్రమాలతో బాటు వ్యక్తిత్వ వికాస కార్యక్రమాలను నిర్వహిస్తున్నది.

"చుట్టూరా ఆవరించుకుని వున్న చీకటిని తిట్టుకుంటూ కూర్చోవడంకంటె ప్రయత్నించి ఎంత చిన్న దీపాన్నయినా వెలిగించడం మంచిది" అన్న ధ్యేయంతో యువభారతి సాహిత్యాన్ని ప్రధాన సాధనంగా చేసుకుని ఇప్పటివరకు 180 పుస్తకాలను ప్రచురించింది. యువభారతి దశమ వార్షికోత్సవాల సందర్భంగా ప్రసిద్ధ తెలుగు కవుల కావ్యాత్మను తెలుగు పాఠకులకు పరిచయం చేయాలని సంకల్పించి ఆ కవుల ముఖ్యమైన పద్యాలకు ప్రసిద్ధ పండితుల, రచయితల వ్యాఖ్యానాలతో 'సాహితీవాహిని' పేర గ్రంథాలను ప్రచురించాలని నిర్ణయించింది. అందులో మొదటితరంగంగా తెలుగువారి అభిమాన కవి బమ్మెర పోతన భాగవతంలోని మందారాల్లాంటి పద్యాలకు డా. సి. నారాయణరెడ్డి గారి మకరంద వ్యాఖ్యానంతో మందార మకరందాలుగా ప్రచురించి తెలుగువారి కందించింది.

జ్ఞానపీఠ పురస్కార గ్రహీతలు, పద్మభూషణ్ డా. సి. నారాయణరెడ్డి, తెలుగు ప్రజలందరికి అభిమాన కవి. యువభారతి స్థాపన నుండి దాని బాగోగులను ఒడిదుడుకులను పరిశీలిస్తూ దాని పురోగతికి తగిన సలహాలనిస్తూ గౌరవ సభ్యులుగా విరాజిల్లుతున్న యువభారతి మేనమామ. వారందించిన '**మందార మకరందాల**'ను యువభారతి స్వర్ణోత్సవాల సందర్భంగా పునర్ముద్రించి తెలుగు పాఠకలోకానికి అందజేస్తున్నాం. యువభారతి కార్యక్రమాల విజయానికి మీ సహకారాన్ని కోరుకుంటూ-

**మాడభూషి అనంతాచార్య**

అధ్యక్షుడు, యువభారతి



# మకరంద మందారాలు

తెలుగు సాహిత్య చరిత్రలో పోతనకి ఒక విశిష్ట స్థానం ఉంది. తెలుగు భాషని మకరందంతో రంగరించి మందారాల్లాంటి పద్యాలను అందించిన ఘనత పోతనగారిది. నిన్నటి తరంలో, కనీసం మహాభాగవతంలోని కొన్ని పద్యాలైనా నోటికి రాని తెలుగువాడుండడంటే అతిశయోక్తి కాదు. ప్రహ్లాద చరిత్ర, గజేంద్ర మోక్షం, రుక్మిణీ కళ్యాణం, వామనావతార ఘట్టం వంటి సన్నివేశాలలో పోతనగారు వ్రాసిన పద్యాలు తెలుగు భాషా ప్రియులకు మధుర మకరంద సదృశాలు.

అటువంటి పోతన భాగవతంలోని ఏర్చి కూర్చిన పద్యాలకు డా॥ సి. నారాయణరెడ్డిగారి మకరంద వ్యాఖ్యానమే ఈ మందార మకరందాలు. యువభారతి సాహితీ వాహిని పరంపరలో ఇది తొలి ప్రచురణ. లక్ష కాపీలను తెలుగువారికి అందించాలనే సత్సంకల్పంతో ఒక రూపాయికే ఆనాడు అందించడం జరిగింది. ఆ ప్రయత్నంలో మేము ఇప్పటివరకు దాదాపు 50,000 ప్రతులను అందచేయటం జరిగింది.

ఈ మందార మకరందాలకు మరింత ప్రచారం కల్పించాలనే సత్సంకల్పంతో ఈ 'మందార మకరందాలు' ప్రచురణ హక్కులను తిరుమల తిరుపతి దేవస్థానం, తిరుపతి వారు తీసుకొని మరికొంత ప్రచారాన్ని కల్పించారు. అయితే ఆడపిల్లని అత్తవారింటికి పంపినా పుట్టినింటి వారికి మమకారం తగ్గదు సరికదా మరింత పెరుగుతుంది. ఆ మమకారంతోనే తిరుమల తిరుపతి దేవస్థానం వారిని అర్థించి, వారి అనుమతితో యువభారతి స్వర్ణోత్సవ సంబరాల ఆరంభ సమావేశంలో మందార మకరందాలను పునర్ముద్రించి ఆవిష్కరించాలని నిర్ణయించడం జరిగింది. ఆ నిర్ణయ ఫలితమే ఇప్పుడు మీ చేతిలో ఉన్న 'మందార మకరందాలు' పుస్తకం.

ఈ పుస్తకాన్ని ఒక ముద్రణకు అనుమతించిన తిరుమల తిరుపతి దేవస్థానం వారికి, ప్రత్యేకించి అప్పటి ఆంధ్రప్రదేశ్ దేవాదాయ శాఖ ముఖ్యకార్యదర్శి (రెవిన్యూ), ఇప్పటి సాంస్కృతిక శాఖ సలహాదారు డా॥ కె.వి. రమణాచార్యులు గారికి మా హార్దిక అభివాదాలు.

ఈ గ్రంథ ప్రచురణకు ఆర్థిక సహాయాన్ని అందించి సహకరించిన ఆంధ్రప్రదేశ్ మహిళా కాంగ్రెస్ అధ్యక్షురాలు, శాసనమండలి పూర్వసభ్యురాలు శ్రీమతి సి. గంగాభవాని గారికి మా ధన్యవాదాలు.

ఈ గ్రంథాన్ని తమ కరకమలాలతో ఆవిష్కరించి, ఆశీర్వదించిన పెద్దలు శాంతా బయోటెక్ అధినేత, పద్మ భూషణ్ డా॥ కె.ఐ. వరప్రసాద రెడ్డి గార్కి మా హార్దిక కృతజ్ఞతలు. ఈ పుస్తకానికి ముఖ పత్రాన్ని అలంకరించిన ప్రముఖ చిత్రకారులు, మా గౌరవ సభ్యులు శ్రీ శీలా వీర్రాజుగారికి అభివాదాలు.

పుస్తక ముద్రణలో సహకరించిన మా యువభారతి సభ్యులు, 'పుస్తక శిల్పి' శ్రీ తాళ్లపల్లి మురళీధరగౌడు గారికి, డి.టి.పి. చేసిన లిటరసీహౌస్ (ఆంధ్రమహిళా సభ) వారికి, పుస్తకాన్ని అందంగా ముద్రించి సకాలంలో అందించిన కర్షక్ ఆర్ట్ ప్రింటర్స్ అధినేత శ్రీ జగన్మోహనరెడ్డి గారికి మా కృతజ్ఞతలు.

గతంలో కేవలం ఒక రూపాయికే అందించిన ఈ పుస్తకాన్ని, మా స్వర్ణోత్సవాల సందర్భంగా 26-10-2012వ తేదీన రవీంద్ర భారతిలో జరిగే ఆరంభ సమావేశానికి విచ్చేసిన సాహితీ బంధువులందరికీ సరస్వతీ ప్రసాదంగా ఉచితంగా అందించడం జరుగుతుంది. అటు తరువాత కూడా ఈ స్వర్ణోత్సవ సంబరాల కాలంలో కేవలం రూ. 10/-కే అందించడం జరుగుతుంది.

సహృదయులు, సాహితీ బంధువులు, యువభారతి శ్రేయోభిలాషులు, మిత్రులు ఈ సదావకాశాన్ని వినియోగించుకోవలసిందిగా కోరుచున్నాము.

సదా మీ సహాయ, సహకారాలనర్థిస్తూ,

తే16-01-2012, భవదీయుడు,

హైదరాబాద్

**అయలసోమయాజుల నాగేశ్వరరావు**

కార్యదర్శి, యువభారతి



# గ్రంథ సిరి

'పద్యం' అంటే పోతనగారిది! గుండెల్లోకి ఇంకి నాల్కలపై నడయాడే 'రసతరంగిణి'. పోతన 'మహాభాగవతం' నేటికీ తెలుగువారి ఇండ్లలో వారెక్కడున్నా పారాయణ గ్రంథం. పోతన పద్యం ఒక్కటైనా నోటికిరాకపోతే ఆ తెలుగుజన్మ వృథాయే. భాగవతం పోతన కేవలం ఆంధ్రీకరించలేదు. "విబుధ జనుల వలన విన్నంత కన్నంత తెలియవచ్చినంత తేటపఱతు" అని వినయంగా అన్నాడు కానీ, భాగవత కథాసుధను ప్రత్యక్షరం తెలిసి పలికాడు. "దీనిని దెనిగించి నా జననంబున్ సఫలంబు చేసెదఁ బునర్జన్మంబు లేకుండగన్" అన్నాడు కానీ, తన జన్మనే కాదు పోతన భాగవత పఠనంతో, శ్రవణంతో తెలుగుల జన్మకే సుకృతం ప్రసాదించాడు.

భాగవతంలోని పన్నెండు స్కంధాలలో బమ్మెర పోతరాజు అనువదించినది ఒకటి నుంచి నాలుగు, ఏడునుంచి పదివరకే, అంటే ఎనిమిది స్కంధాలు మాత్రమే. బొప్పరాజు గంగరాజు పంచమస్కంధాన్ని, ఏర్చూరి సింగన షష్ఠమస్కంధాన్ని, వెలిగందల నారయ ఏకాదశ ద్వాదశ స్కంధాలను రచించారు. కూచిమంచి తిమ్మకవి 'లక్షణ సారగ్రంథం'లో ఈ విషయం విశదీకరించాడు. సర్వజ్ఞ సింగమ నాయుడు తాను కోరినా, పోతన భాగవతాన్ని తనకు అంకితం ఇవ్వలేదని కోపించి, భాగవత పురాణాన్ని గోతిలో పాతించాడని, అందువల్ల తాళపత్రాలు కొంతవరకు శిథిలమై పోయినందున గంగనాది కవులు నశించిన భాగాలు పూరించడంతో భాగవతం పూర్తిగా లభ్యం కలిగిందన్న విషయం ప్రాచుర్యంలో ఉంది.

సీ. *ఘనుడు పోతన మంత్రి మనుభాగవతము ర*
*చించి చక్రికి సమర్పించునెడల*
*సర్వజ్ఞ సింగయక్ష్మావరుం డది తన*
*కిమ్మనివేడగా నీయకున్న*
*నలిగి యా పుస్తకం బవనిఁ బాతించినఁ*
*జవికి యందొకకొంత శిథిలమయ్యెఁ*
*గ్రమ్మఱనది వెలగందల నారప*
*రాజును మఱి బొప్పరాజు గంగ*

*రాజు మొదలగు కవివరుల్ తేజమెసఁగఁ*
*జెప్పి రా గ్రంథముల యందె తప్పులొదవెఁ*
*గాని పోతన కవీంద్రుని కవితయందు*
*లక్షణం బెందుఁ దప్పునా దక్షహరణ*

(కూచిమంచి తిమ్మకవి-'లక్ష్మణసారగ్రంథం')

భక్తికి ముక్తికి భాగవతం పోతన ప్రసాదించిన వరం. పోతనవంటి కవి మరొకరు లేడు. ఆయనదే అగ్రాసనం. ఖ్యాతి గడించిన కవులెందరున్నా 'జనవశీకరణాద్భుత శక్తి' పోతన భాగవతందే! పోతనలో ప్రతివాడూ భక్తిభావశబలతలో- 'తన'ను పో! చూసుకోగలుగుతాడు. ప్రతి పద్యంలో హృద్యంగా రసమంచితంగా తల్లీనమవుతాడు. సహజ పాండితితో కవితామృత భక్తిధారలు కురిపించిన పోతన తన గంటాన్ని పంచదారలో అద్ది ఇంత మధుర భావాలను ఒద్దికగా ఇచ్చి వుంటాడనీ, తీయని రసాల రసాలు ఆయన లేఖినిలో చింది పోసాగినవేమో అనీ కరుణశ్రీ గారు ఊరకే అనలేదు. పోతన పద్యాల మందారమకరందం గురించి కరుణశ్రీ జంధ్యాల పాపయ్య శాస్త్రి గారన్నట్లు-

*అచ్చపు జుంటితేనియల, నైందవ బింబ సుధారసాల, గో*
*ర్వెచ్చని పాలమీగడల, విచ్చెడి కన్నె గులాబి మొగ్గలన్*
*మచ్చరికించు ఈ మధుర మంజుల మోహన ముగ్ధ శైలి నీ*
*వెచ్చట నేర్చినావు? సుకవీ? సుకుమార కళా కళానిధీ!*

*కమ్మని తేటతెల్గు నుడికారము లేరిచి కూర్చి చాకచ*
*క్యమ్ముగ కైతలల్లు మొనగాండ్రు కవీశ్వరు లెంతమంది లో*
*కమ్మున లేరు - నీవలె నొకండును భక్తిరసామృత ప్రవా*
*హమ్ములకేత మెత్తిన మహాకవి యేడి తెలుంగుగడ్డపై?*

అన్నది ప్రత్యక్షర సత్యం! పోతన పద్యం నేరుగా పఠిత గుండెను తాకుతుంది. అన్వయక్లిష్టత గానీ, అర్థం కాకపోవడం గానీ ఏమీ వుండదు. పోతన పద్యాల భావాలు లోతులు తరచిన కొద్దీ హృదయంగమమై ఉన్నతులను చేస్తాయి. పోతన పద్యాలకు

ఔచితీమంతము, రసప్లావితమూ అయిన వ్యాఖ్యానాన్ని సంతరించి డా॥ సి. నారాయణరెడ్డిగారు ఈ 'మందార మకరందాలు' యువభారతికి ఎన్నడో ఉపాయనంగా అందించారు. యువభారతి ఇప్పటికే వేలాది ప్రతులను జనంలోకి తీసుకువెళ్లింది. 'లక్షప్రతులనోము' నోచినట్లుగా ఇప్పుడు పునర్ముద్రణకు నోచుకుంటున్న ఈ గ్రంథం ఈ తరం పాఠకుల చేతుల్లోకి వెళ్లి వారి 'హృదయవాసి' కావాలన్నది తపన. ఇంటింటా వుండదగిన గ్రంథం ఇది. భాగవతంలోని ఎంపిక చేసిన అద్భుత పద్యాలకు నారాయణరెడ్డిగారు తనదైన కవితామాధుర్యంతో, వ్యాఖ్యాన దక్షతతో- 'మందార మకరందాలు'గా ఈ రూపునిచ్చారు. ఇందులోని పద్యాలు పఠించినాచాలు, రసనపై నిలుపుకున్నా చాలు 'నరుండు శాశ్వత శుభారూఢుండు'. పోతన పద్యాలకు నారాయణరెడ్డిగారి వ్యాఖ్యానం బంగారానికి తావి అబ్బినట్లుగా- ఇప్పటికే ఈ పుస్తకం వేలాది ప్రతుల చెల్లుబాటే తార్కాణం! ఆచార్య నారాయణరెడ్డిగారి వ్యాఖ్యానం ఎలావుందో మళ్ళీ ఇక్కడ వ్యాఖ్యానించనవసరం లేదు. పోతన పద్యం, దానికి సినారె వివరణ గద్యం, రెండూ అత్యంతహృద్యం! యువభారతి సాహితీసేద్యంలో ఇదొక మంచి 'పంట'. మీ ఇంట ఈ 'గ్రంథసిరి'ని నిలుపుకుని, అమందానందకందళిత హృదయారవిందులై భాసించండి.

12-10-2012

**సుధామ**

ప్రధాన సంపాదకుడు

యువభారతి ప్రచురణలు



# ప్రేరణ

## (మూడవ ముద్రణ)

ఈ శ్రీరామ నవమికే లక్ష ప్రతుల లక్ష్యాన్ని చేరుకోగలిగితే బాగుండేదని ప్రచురణకు పూనుకున్నాం. మందార మకరందాలు ఈనాడు విడుదలవుతున్న మూడవముద్రణతో ప్రచురించిన మొత్తం ప్రతుల సంఖ్య నలభైవేలు. ఈ నలభైవేలు బహుశః యువభారతికి పాస్‌మార్కులేమోః

ధరలు పెరిగినా ధైర్యాన్ని సడలనివ్వక మూడవ ముద్రణ ప్రతులను సైతం రూపాయికే అందిస్తున్నాం. పోతన పద్యాలు పదైనా వినకుండా, ఓ నాలుగైనా నోటికిరాకుండా ఉండటం– తెలుగు తనానికి వన్నె తెచ్చేది కాదన్న అభిప్రాయంతో, లక్ష ప్రతుల లక్ష్యాన్ని నిర్ణయించుకున్నాం.

మీలో ప్రతివొక్కరూ కేవలం మరొక్క ప్రతైనా మిత్రులకు అందించేందుకు పూనుకొని, సహకరించాలని, మా సంకల్పానికి అక్షయమైన శ్రీరామ రక్షగా నిలవాలని మీ సహకారాన్ని కాంక్షిస్తూ–

1-4-1974, శ్రీరామ నవమి

**వంగపల్లి విశ్వనాథం**
సమావేశకర్త, యువభారతి

## (రెండవ ముద్రణ)

శిశువుకు ఈ సందేహం రాదు– తల్లిని ఎందుకు ప్రేమించాలని? ఆ కన్నతల్లికీ రాదు. ఈ పరస్పర అనురాగ సంబంధంలో సృష్టి మనుగడకు అవసరమైన తియ్యటి అనుబంధం వుంది, ఆనందం ఉంది. ఈ అనుభవం, అందనిదీ, తెలియనిదీ కాదు– ఇది అందమైనదీ, తియ్యనిదీ కావడంవల్ల ఇలాంటి అనుబంధమే ఒక భాషకూ– ఆ భాషను మాట్లాడే ఆ జాతి సంతతికి ఉంది. 'నన్ను గన్న తండ్రి:' ఏ తెలుగు తల్లైనా ఇలాగే అంటుంది కన్నకొడుకును. 'కన్న తండ్రి' అని పిలవడం, తెలుగు భాషకు

దక్కినవరం. ఇలాంటి ఆత్మీయమైన వరాల్ని-మరింత స్వంతం చేద్దామని-భాషలోని తియ్యందనాలను, మరింత దగ్గరగా అనుభవంలోకి తీసుకు రావాలని-పోతన భాగవతంలోని మందారాలను ప్రతి తెలుగు ఎదలో సాక్షాత్కరింపచేయాలని - అందుకు నాందిగా - లక్షప్రతులు ఒక్కరూపాయికే అందించాలనీ- తొలి విడతగా 25,000 ప్రతులు ముద్రించి అందించాం.

తెలుగు సాహిత్యంలో - అనేక ముద్రణలు పొందిన గౌరవమూ - లక్షలాది ప్రతులు చెల్లుబడి అయిన సందర్భాలూ, అనేకం ఉండొచ్చు. ప్రథమముద్రణలో-పాతిక వేల ప్రతులుగా అవతరించి, నెల తిరిగేసరికల్లా రెండవ ముద్రణకు ప్రేరణను కల్పించిన పుస్తకం, ఈ మందార మకరందాలేనేమో! ఈ గౌరవాన్ని యువభారతికి దక్కించిన తెలుగుసోదరులకు, మేము అంజలిఘటిస్తున్నాం.

ఆశించినంత వేగంగా కాకపోయినా - తెలుగు జనం, మొదటి ముద్రణను ఆదరించింది. 25,000 ప్రతులూ 5 వారాలలో పాతికవేల గృహాలను చేరుకోగలిగాయి. వందలాది మిత్రులు మనస్ఫూర్తిగా సహకరించారు. నిజానికి, వేలాదిమంది ఈ ఆత్మీయతను ప్రదర్శించి ఉండాల్సింది. ఈపాటికి - లక్ష ప్రతులూ చెల్లిపోయి ఉండాల్సింది. అంత అదృష్టానికి మేం ఎందుకు నోచుకోలేదో- మాకు అర్థం కావడంలేదు. పోతన-రూపాయి విలువ చెయ్యడో? లేక రూపాయి విలువ అంతగా పెరిగిపోయిందో? మాకు తోచడం లేదు. ఏదేమైనా కనీసం ఇప్పుడైనా -మొదటి ముద్రణ ప్రతులు అందుకున్న పాతికవేల మందీ, రెండవ ముద్రణ ప్రతులు అందుకోనున్న మరో పదివేలమందీ-కలిసి పూనుకుంటే- లక్షప్రతులు అందించాలన్న ధ్యేయం-పెద్ద కష్టం కాదు. మీనుండి మేం ఆశిస్తున్నది- మీద్వారా మరొక్క ప్రతైనా అందించి - మాకు సహకరించండని.

లక్ష్యసాధనలో అనేక ఇబ్బందులను ఎదుర్కొనవలసి వుంటుందని - కార్యరంగంలో దూకిన అనుభవమున్న అందరికీ తెలిసిన విషయమే. అయినా- ఒకటి రెండు విషయాలను ప్రస్తావించక తప్పదు.

తెల్లకాగితం-నిజం, బంగారంలా వుంది. 'మందార మకరందాలు' మొదటి ముద్రణ సంకల్పించిననాడు- పాలమీగడ లాంటి కాగితం ధర - రీముకు 46-00 రూపాయలు మాత్రమే. ఈ రెండవ ముద్రణకు- అసలు, కాగితం కనబడకుండా అదృశ్యమైంది ధరలు

పెరిగి, ఆకాశాన్నందుకొని– 'ఇంతింతై వటుడింతై...' కనబడకుండానే కాదు, అందకుండానూ పోయింది.

నాసిరకం కాగితాన్ని – రీముకు 77 రూపాయల చొప్పున ఖరీదు చెయ్యాల్సి వచ్చింది. అచ్చుపనిలో– అనుభవమున్న ఎవరికైనా తెలుస్తుంది– ఇది ఎంతటి సంకటస్థితో. అయినా కష్టాన్ని మరింత భరిద్దామని–కేవలం–మాటతప్ప కూడదన్న మాటపై పట్టుదలతో ఈ రెండవ ముద్రణను రూపాయికే అందిస్తున్నాం. ధరలు ఇలానే పెరిగితే – భవిష్యత్తులో ఏం చెయ్యాల్సి ఉంటుందో ఇప్పుడు ఊహించడం కష్టంగానూ, అనిష్టంగానూ ఉంది. మా శక్తి మేరకు, తెలుగువారి ఆసక్తిమేరకు, కృషిచేయడానికి యువభారతీయులం కంకణం కట్టుకున్నాం. ఇకపై ఆ దేవుని దయ ఎలా ఉందో– తెలుగువారి భాగ్యం ఎలాంటిదో– మాకు ఏది ప్రాప్తమో– మాకేం తెలుసు: "నిమిత్తమాత్రం భవ!" అని కృషి కొనసాగిస్తాం. ఉడుతాభక్తిగా మేం చేస్తున్న కృషికి– సహృదయుల సహకారమే శ్రీరామరక్ష. మేం వెలిగించిన చిన్న దీపం కాంతికిరణాలను సంరక్షించడంలో మీరూ బాధ్యత పంచుకోవాలని, సవినయంగా విన్నవిస్తున్నాం.

మరొక్క విషయం –వీలున్నంతవరకూ, అందమైన గెటప్‌తో పుస్తకాలను అందించడం అవసరమనుకున్న మా నమ్మికకు ఆకృతిగా, మందార మకరందాలను మలిచాం. పేపరు కొఱత దృష్ట్యా– మరో 25,000గా వెలువడవలసిన రెండవ ముద్రణ కేవలం పదివేలుగానే రావడం ఒకవైపు – మరో వైపు పుస్తకం అందాన్ని–రవ్వంత కుదించక తప్పింది కాదు. సంఖ్యా పరంగా –పేజీల సంఖ్య కొంచెం తగ్గినా, మొదటి ముద్రణలో అచ్చుకు నోచుకున్న ప్రతి అక్షరం, రెండవ ముద్రణలో చోటు చేసుకొంది. తప్పనిసరియైన పరిస్థితిలో చేయక తప్పనందుకు, సహృదయులు అర్థం చేసుకొంటారని ఆశిస్తున్నాం. కరుణశ్రీగారి పద్యం "అందమును..." గుర్తుకు వస్తోంది. తప్పిందికాదు మరి.

మందారమకరందాలు ఆవిష్కరణతో – అవగతమవుతున్న మా కృషి స్వరూప స్వభావాలను, ఆదరంతో అర్థం చేసుకోగలరనీ ఆశిస్తూ– సాహితీమిత్రులుగా చేరండని ఆహ్వానిస్తున్నాం.

సదా మీ సహకారాన్ని కాంక్షిస్తూ–

2-2-1973

**వంగపల్లి విశ్వనాథం**

సమావేశకర్త

## (మొదటి ముద్రణ)

సాహితీ సమాలోచనంద్వారా సమ్యక్ దృష్టి ఏర్పడుతుందనీ, సమాజంలో, చైతన్య వికాసానికి దోహదం చేస్తుందనీ యువభారతి పెద్ద ఎత్తున తల పెట్టిన కార్యక్రమాలలో మొదటిది 'లహరి' పేరున ఉపన్యాసమంజరి పరంపర– రెండవది 'సాహితీ వాహిని.'

గతంలోని మంచిపట్ల అభిమానం అవసరం. ఆ మంచి ఊతగా మరింత మంచిని సాధించే కృషికి దోహదం చేయవచ్చు. కానీ, ఆ అభిమానం దురభిమానంగా మాత్రం పరిణమించకూడదు. మన భాషకు సాహిత్యం, ఆ సాహిత్యంలో లాలిత్యం మన జాతికి సంస్కృతి, ఆ సంస్కృతిలో విశిష్టమైన సంస్కారం ఉన్నాయి నిజమే: ఏ భాషలో లేవు కనుక? ఏ సంస్కృతిలో కానరావుకనుక? కాని ఎందుకోగానీ తెలుగువాడికి తన జాతి, సంస్కృతిలో భాష అంటే – కొంత చిన్న చూపు (హేళన), పొరుగింటి పుల్లకూర రుచి ఎక్కువ. నిజంగా బేరీజువేసి, తన దేమంత గొప్పదికాదని నిర్ణయించడం వేరు విషయం, ఏమీ తెలుసుకోకుండానే– పెదవి విరిచే తత్త్వం విరివిగా కనిపిస్తుంది. అందుకే – అందుబాటులో ఉండేలా పోగేసిన మంచిని పంచిపెడదామన్న ఉద్దేశంతో, ఈ 'సాహితీ వాహిని' పరంపరను తలపెట్టాం. తీరిక దొరకక అనేక వ్యాపకాలతో సతమతమయ్యే మనిషి మనస్సును, ఓ విధంగా ఉత్తేజపరచాలనీ, ఆలోచనవైపు దృష్టి సారించేలా చేయాలనీ వీలున్నంత చవుకగా సాహిత్య సాంస్కృతిక రంగాలలోని విశేషాలను అవగాహనలోకి తెచ్చుకోగలగాలనీ, మా ధ్యేయం.

పోతన పేరువింటే పొంగిపోతుంది తెలుగువాడి హృదయం; అతని పద్యం అంటే పులకించిపోతుంది. ఆ పోతన సృష్టించిన సుందర పదబంధాలలో సింగారించుకొన్న తెలుగుతనాన్ని, అంతరంగాల నలరించే మహత్తర కవితాశక్తిని, ప్రతి తెలుగింటిలోనూ సాక్షాత్కరింపజేయాలనీ, ఒక్క రూపాయికే అందించటం ద్వారా ఈ ధ్యేయాన్ని సాధించగలమనీ, ముందడుగు వేస్తున్నాం. నాందిగా లక్ష ప్రతులను అందించాలని సంకల్పిస్తున్నాం. తొలి విడతగా 25,000 ప్రతులు ముద్రించి విడుదల చేస్తున్నాం.

చక్కని సాహిత్యం అందంగా, తక్కువ ధరలకు అందించాలనే మా ఆశయాన్ని, సహృదయలోకం అర్థం చేసుకోగలదనీ, ఆదరించి సహకరించగలదనీ ఆశిస్తున్నాం.

‘మందార మకరందాలు’ కొన్న సహృదయులందరూ యువభారతి సాహితీ మిత్రులుగాచేరి మా కార్యక్రమాలతో అనుబంధాన్ని ఏర్పరచు కొంటారని ఆశిస్తూ, ఆహ్వానిస్తున్నాం.

తెలుగు నేలపై అక్షరాస్యులున్న ప్రతిఇంటిలోనూ ‘మందార మకరందాలు’ వెలుగు విరజిమ్మాలన్న మా కృషిలో మీ మనస్ఫూర్తి సహకారాన్ని అందించండి మీ మిత్రులకై మీరే కొని బహూకరించవచ్చు, మీ ఆదరాభిమానాలను అక్షరాకృతిగా; కానుకగా. ఒక రూపాయి పెద్ద మొత్తం కాదు. ఒక లక్ష ప్రతులను అందించడం కష్టం కాదు - సహృదయులైన మీరందరూ పట్టుదలతో పూనుకుంటే.

“సింధువును చేరి బిందువు సింధు వగును” అంటారు. “నే నొక్కడిని చేస్తే ఏ మౌతుంది?” అనుకుంటూ - ఊర్కుండి పోకుండా - మీలో ప్రతి ఒక్కరూ- మరొక్క ప్రతి-కేవలం ఒక్క ప్రతే-అందించడానికి పూనుకుంటే చాలు ఈ 25.000 ప్రతులు-వారంరోజుల్లో రెండింతలై, మరో వారం తిరిగేసరికల్లా లక్ష ప్రతుల ధ్యేయాన్ని అధిగమించ గలుగుతుంది. మీనుండి సవినయంగా అర్థిస్తున్న సహకారం ఇది - మీద్వారా మరొక్క ప్రతిని అందించి లక్ష ప్రతుల సంకల్పాన్ని నిజం చేసిపెట్టండని.

అదే మా సంకల్పానికి అక్షయమైన రక్ష, శ్రీరామరక్ష,

సదా మీ సహకారాన్ని కాంక్షిస్తూ-

21-10-1973

**వంగపల్లి విశ్వనాథం**

సమావేశకర్త



రిజిష్టర్ నెం : 1/64

**యువభారతి నగర కేంద్ర గ్రంథాలయ సంస్థ**
**సంయుక్త ఆధ్వర్యంలో ప్రతినెలా మొదటి ఆదివారం**

**మధ్యాహ్నం 2-00 గంటల నుండి 5-00 గంటల వరకు, చిక్కడపల్లి అశోక్‌నగర్‌లో వున్న నగర కేంద్ర గ్రంథాలయంలో, యువభారతి సమావేశకర్త ఆచార్య వంగపల్లి విశ్వనాథం తెలుగులో నిర్వహిస్తున్న వ్యక్తిత్వ వికాస ఉపన్యాసాలకు అందరూ ఆహ్వానితులే. ప్రవేశం: ఉచితం.**

# సౌరభం

*"లలితస్కంధము, కృష్ణమూలము, శుకాలాపాభిరామంబు, మం
జులతాశోభితమున్, సువర్ణమనస్సుజ్ఞేయమున్, సుందరో
జ్జ్వలవృత్తంబు, మహాఫలంబు, విమలవ్యాసాలవాలంబు నై
వెలయున్ భాగవతాఖ్యకల్పతరు వుర్విన్ సద్ద్విజశ్రేయమై."*

భక్తికి మారుపేరుగా భాగవతాన్ని చెప్పుకుంటారు తెలుగువారు. దానికి కారణం దానిలో ఉన్న భక్తిగాథలే కాదు–బమ్మెరపోతరాజు కమ్మనికవిత్వం. స్వయంగా భక్తుడై భగవన్నామస్మరణం చేతనే పారవశ్యాన్ని భజించే చిత్తంతో భగవంతుని ప్రేరణతో–భాగవత రచన చేపట్టాడు పోతన్న. కవిత్వం అతనికి కైవల్యసాధనం. కైవల్యం జ్ఞానంవల్లగాని కైవశం కాదు. నిర్గుణమైన బ్రహ్మాన్ని జ్ఞానంవల్ల పట్టుకోవచ్చు కాని, అది సర్వజనసులభం కాదు. అందరికీ అందుబాటులో ఉండేది భక్తి, భక్తిమార్గం మధురాతిమధుర మైనది. సగుణ బ్రహ్మను సమాహితంతో సాక్షాత్కరించు కొనటానికి అంతకంటే సులభమైన మార్గం మరొకటి లేదు. 'నీవే తప్ప నితఃపరం బెఱుగ మన్నింపందగున్ దీనునిన్, రావే ఈశ్వర! కావవే వరద! సంరక్షింపు భద్రాత్మకా' అని ఆక్రందించే ఏ భక్త చిత్తానికైనా భగవంతుడు ప్రత్యక్ష మౌతాడు. భక్తరక్షణ కళాపారీణుడైన ఆ భగవంతుడు శ్రీమన్నారాయణుడు కావచ్చు, శ్రీ నృసింహస్వామి కావచ్చు, గోవిందుడు కావచ్చు, ముల్లోకాలను బొజ్జలో ఇముడ్చుకున్న విశ్వరూపుడు కావచ్చు– భక్తుని భావనాపటిమ ననుసరించి భగవంతుడు బహురూపాలతో అవతరిస్తాడు. శిష్టరక్షణంతో పాటు దుష్టశిక్షణం కూడా చేస్తాడు.

భక్తి అనేది ఒకవిధమైన చిత్తపరిపాకం. ఆకలి అవుతున్న పసిబాల అమ్మపాలకోసం అలమటించినట్లుగానే మానవుని అంతరాత్మ అఖండ చిన్మయానందంకోసం ఆరాటపడుతుంది. తియ్యనిపాలకై తల్లిపాలిండ్ల కోసం తడిమే పసికూనలాగానే అంతరాత్మ ఆ అనిర్వచనీయానందానుభూతికోసం అన్వేషణ ప్రారంభిస్తుంది. ఆ అన్వేషణలోనే అంతరాత్మ ఎంతో ఎదుగుతుంది. యౌవనంలో ఉన్న యువతి మనోహరుని మధురానురాగంకోసం ఎలా రతిభావాన్ని భజిస్తుందో, అన్వేషణలో ఆర్తయైన అంతరాత్మ అలా ఆ పరంజ్యోతి పరిష్వంగం కోసం పారవశ్యంతో పలవరిస్తుంది. ఇలా భగవద్రతితో

పారవశ్యాన్ని చెందే పరిణతమైన చిత్తపరిపాకమే భక్తి. రతిచ్ఛాయ ఉండటంచేత పైకి అది శృంగారంగా కనపడుతుంది. కాని అది లోకంలో ప్రేయసీ ప్రియుల మధ్య కనపడే భౌతికమైన రతి కాదు. జీవాత్మ పరమాత్మల సమైక్యం కోసం అంతరమైన చైతన్యం అభిలషించే అవ్యక్తమైన ఆధ్యాత్మికరతి. అది పరిపూర్ణం. అఖండ ఆనంద నిధానం. భాగవతంలో గోపికల ప్రణయతత్త్వం ఇదే.

*"నల్లనివాఁడు, పద్మనయనంబులవాడు, కృపారసంబు పైఁ*
*జల్లెడు వాఁడు మౌళిపరిసర్పిత పింఛమువాఁడు నవ్వు రా*
*జిల్లెడుమోమువాఁ, డొకఁడు చెల్వలమానధనంబుఁదోచె నో*
*మల్లియలార! మీ పొదలమాటున లేఁడుగదమ్మ చెప్పరే?"*

అని గోపిక లన్వేషించింది గోపాలకృష్ణుణ్ణైనా, పరమార్థంలో పరమాత్మ తత్త్వాన్నే! పైకి కనపడుతున్న ఈ స్త్రీ పుంస భావంలోనుండి ఒక మధురమైన రతి భావం ప్రతీయమానం అవుతున్నది. ఆ రతి భగవత్పరంగా ప్రవహిస్తుండటం చేత భక్తిగా పరిణమిస్తున్నది. ఈ భక్తి ఇంద్రియపరితృప్తికోసం లక్షించింది కాదు. భవబంధ విముక్తి కోసం ప్రవర్తించింది. వేణుగానలోలుని కల్యాణవిగ్రహాన్ని కన్నులార గాంచిన ఆ గోపకాంతలు–పరమేశ్వరుణ్ణి దర్శించిన భాగవతోత్తముల్లాగా పరమానందాన్ని పొంది, తరించారు.

"క. *హరి సురుచిర లలితాకృతిఁ*
*దరుణులు గని ముక్త విరహతాపజ్వర లై*
*పరమోత్సవంబు సలిపిరి*
*పరమేశ్వరుఁగనిక ముక్తబంధులభంగిన్"*

అని పోతన్న వర్ణించాడు; ఉద్దిష్టతాత్పర్యాన్ని ఉపమానంలో ఉంచి ఉజ్జ్వలం చేశాడు. శృంగారం యవనికగా భగవద్భక్తి లాస్యం చేసిన కవితారంగం భాగవతగ్రంథం.

భాగవత భక్తులలో తమోగుణ ప్రధానుడైన గజేంద్రుడున్నాడు. రజోగుణ ప్రధానుడైన ధ్రువుడున్నాడు. సత్త్వగుణప్రధానుడైన ప్రహ్లాదుడున్నాడు. రక్తితో ఆరాధించే రమణులున్నారు. రాజసంతో సేవించే రాజర్షులున్నారు. భిన్నరుచులు గల లోకం ఇన్ని

విభిన్న ప్రవృత్తులు గల భాగవత భక్తలోకంలో ఎక్కడో ఒక్కచోట తన చిత్తవృత్తికి అభిన్నంగా ఉన్న సన్నివేశంలో రమిస్తుంది. అప్పుడు పరవశిస్తుంది. ఆ పారవశ్యంలో భక్తి ఉజ్జ్వలంగా వెలుగొందుతుంది. సర్వమానవహృదయాంతరాళాల్లో భక్తి ప్రసూనాలను పరిమళింపచేసే సాహిత్యకల్పవృక్షం భాగవతమహాపురాణం.

బమ్మెర పోతన్న మహాభక్తుడే కాక సహజకవితాధురీణుడు కావటంచేత భాగవత భక్తులందరిలో తాను తాదాత్మ్యం చెంది కవితావేణువును మ్రోగించాడు. అంతరాత్మలో తరంగితమయ్యే భక్తిభావలహరి కవితాస్రవంతిగా అతని నాలుకపై తురగలించి పద్యతరంగాలుగా భాగవతంలో ప్రవహించింది. అందువల్లనే మూలంకంటె ఈతని రచన మూడింతలు పెరిగింది.

*"తనుహృద్భాషల సఖ్యమున్, శ్రవణమున్, దాసత్వమున్, వందనా*
*ర్చనముల్, సేవయు, నాత్మలో నెఱుకయున్, సంకీర్తనల్, చింతనం*
*బను నీ తొమ్మిది భక్తిమార్గముల సర్వాత్మున్, హరిన్ నమ్మి స*
*జ్జనుఁడై యుండుట భద్రమంచుఁ దలతున్ సత్యంబు-దైత్యోత్తమా"*

అని ప్రహ్లాదుని నోట చెప్పించిన నవవిధ భక్తిమార్గాలనూ భాగవతంలో నవ నవోన్మేషంగా పోషించాడు పోతన్న. భగవద్విధేయులైన భక్తులనోట పరమ రమణీయంగా భక్తిని పొంగించటమే కాకుండా భగవద్విరోధుల నోటకూడా నిందలో స్తుతిని గూఢంగా అనుసంధించాడు పోతన్న.

భక్తి-కవితలో రక్తి కట్టాలంటే శ్రవణం, సంకీర్తనం, చింతనం అనే భక్తిమార్గాల కది పరిపోషకంగా ఉండాలి. కవితకు లలితశబ్ద సంయోజనంవల్లా, మధురాక్షరపునరావృత్తివల్లా భగవద్గుణ సంకీర్తనంవల్లా, రాగరంజితమైన శైలివల్లా. అలవోకగా అవధానం చేయగలిగే పద్యవిద్యవల్లా కవితలో సంకీర్తనకు సౌలభ్యం ఏర్పడుతుంది. భావనాగంభీరాలైన అర్థాలంకారాలవల్లా, ఆలోచనామృతాన్ని వర్షించే సార్థక పదప్రయోగం వల్లా, వ్యంగ్యసౌరభాన్ని వెదజల్లే వాక్యవిన్యాసం వల్లా, అరటి పండొలిచి పెట్టినట్లు అభివ్యక్తం చేసే తాత్త్విక తాత్పర్యంవల్లా కవిత్వం పఠితలలో చింతనను రేకెత్తింపజేస్తుంది. బమ్మెరపోతన్న కవిత్వం ఈ లక్షణాల నన్నింటినీ సలక్షణంగా సమన్వయించుకొన్నది.

*'మందారమకరంద మాధుర్యమున దేలు*
*మధుపంబు బోవునే మదనములకు?'*

ఇటువంటి రచనలోని మాధుర్యం శ్రవణాన్ని ఆకట్టుకుంటుంది.

'కమలాక్షు నర్చించు కరములు కరములు
శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ'

ఇటువంటి రచనలో సంకీర్తనం స్వాదువుగా వినిపిస్తుంది.

*'ఇందు గల డందు లేఁడని*
*సందేహము వలదు, చక్రి సర్వోపగతుం*
*డెందెందు వెదకి చూచిన*
*నందందే కలఁడు దానవాగ్రణి వింటే'*

వంటి పద్యాలు పఠితల్లో తాత్త్విక చింతనాన్ని ప్రేరేపించే హృద్యపద్యోపనిషత్తులు.

*'అమ్మలఁగన్న యమ్మ, ముగురమ్మల మూలపుటమ్మ, చాలఁబె*
*ద్దమ్మ, సురారులమ్మ, కడుపాఱడిపుచ్చిన యమ్మ, దన్నులో*
*నమ్మిన వేల్పుటమ్మల మనమ్ముల నుండెడియమ్మ, దుర్గ, మా*
*యమ్మ కృపాబ్ధి యిచ్చుత మహత్త్వకవిత్వపటుత్వ సంపదల్.'*

వంటి పద్యాల్లో కనపడే వృత్త్యనుప్రాసం వట్టి శబ్దాడంబరం కాదు. పఠితలను మైమరపించే సమ్మోహనమంత్రం. తేటతెలుగు మాటలే కావు, దీర్ఘ సంస్కృత సమాసాలు కూడా మందార మకరంద ప్రవాహంగా పోతన్న కవితలో తరుగని రుచుల నీనుతుంటాయి. చూడండి:

*'శారద నీరదేందు ఘనసార పటీర మరాళ మల్లి కా*
*హారతుషార ఫేన రజతాచలకాశ ఫణీశకుందమం*
*దారసుధాపయోధి సితతామరసామర వాహినీశుభా*
*కారత నొప్పు నిన్ను మదిఁ గానఁగ నెన్నఁడు గల్గు భారతీ'*

పోతన్న భక్తికవిత్వమే ఆంధ్రమహాభాగవతానికి ప్రాణం. తెలుగు దనం తేటపడే అతని వాక్పాకం స్వచ్ఛమైన అతని శీలానికి ప్రతిబింబం. రాజుల నీసడించి, రాముణ్ణి

ఆశ్రయించి. భోగాలను గర్హించి, భగవంతుణ్ణి కీర్తించిన పోతన్న జీవితం ఉత్తమ మానవతకు ఉజ్జ్వల మణిదర్పణం.

*'నీ పాద కమలసేవయు*
*నీ పాదార్చకులతోడి నెయ్యము, నితాం*
*తాపారభూతదయయును*
*దాపసమందార! నాకు దయసేయగదే:'*

అని భక్తితోపాటు భూతదయను ప్రసాదింపు మని భగవంతుణ్ణి కోరుకున్న దయామూర్తి పోతన్న. అతని భూతదయ తెలుగులోకంమీద ప్రసరించింది. ప్రజలు కలకాలం పాడుకొనటానికి అనువైన భాగవతరచనంగా అది పరిణమించింది. పోతన భాగవతం ప్రజలకోసం వ్రాసినాడు. భగవంతునిమీద నమ్మకం లేని పచ్చినాస్తికుడైనా అతని పలుకుబడికి పారవశ్యం పొంధవలసిందే: జాతిలో ఈ కవి పద్యాలూ, పదబంధాలూ, లోకోక్తులూ వాచవిని కల్పిస్తూ వ్యవహారంలో విరివిగా ప్రచారంలో ఉన్నవి. భాగవతంలో కనీసం ఒక పద్యమైనా నోటికి రాని తెలుగువాడు తాను తెలుగువాణ్ణని చెప్పుకోవటానికి సిగ్గుపడతాడు.

ఇంతటి ప్రజాదరాన్ని చూరగొన్న బమ్మెరపోతన్న కవిత్వంలోని ప్రసిద్ధ పద్యాలను ఎన్నికచేసి 'సాహితీ వాహిని' ప్రథమతరంగంగా ప్రచురింప సంకల్పించిన యువభారతి ప్రయత్నం అభినందనీయం:

మందారాలవంటి మహనీయమైన పద్యాలలోని మకరంద మాధుర్యాన్ని పఠితలకు చవిచూపించి మురిపించేలా మనోజ్ఞమైన వ్యాఖ్యానాన్ని మధురకవులు డా॥ సి. నారాయణరెడ్డి చేత వ్రాయించటం బంగారానికి తావి కల్పించటం వంటిది.

డా॥ సి. నారాయణరెడ్డిగారు భాగవతప్రాశస్త్యాన్నీ, పోతన వ్యక్తిత్వాన్నీ కవితామాధుర్యాన్నీ వ్యక్తీకరించే కమ్మనిపద్యాల నిందులో ఎన్నుకొన్నారు. భాగవతపద్యాలచుట్టూ పరివేషంగా పరిమళించే తాత్త్విక సౌరభాన్నీ, రచనలో అంతర్భూతంగా అందగించుకొన్న కళాసామ్రాజ్యాన్నీ పుక్కిటపట్టే సరళ సుందరమైన శైలిలో వ్యాఖ్యానం రచించారు. 'మందారమకరందాల'ను చదివే పఠితకు ఈ వ్యాఖ్యానం చదువుతున్నట్లనిపించదు నారాయణరెడ్డిగారు మధురంగా మాట్లాడుతుంటే

వింటున్నట్లుంటుంది. పోతన పద్యంలో కవి వ్యక్తిత్వం లాగానే వ్యాఖ్యానంలో వ్యాఖ్యాతవ్యక్తిత్వం ప్రత్యక్షమౌతుంది. పోతన్న కవితాతత్త్వాన్ని సాక్షాత్కరింపచేసే పద్ధతితోపాటు కొన్ని పద్యాల్లోని భావాలను కొత్త చూపుతో సమీక్షించే ప్రత్యేకతను ప్రదర్శించారు శ్రీ నారాయణరెడ్డిగారు. పోతన ప్రజాకవిగా ప్రఖ్యాతి పొందటానికి కారణాలైన ఆయువుపట్టుల్ని ఎత్తి చూపించారు. పోతన కవితలో కట్టిన బొమ్మలు, అక్షరాలలో అమర్చిన శిల్పాలు, పాత్రల మనఃప్రవృత్తికి ఛందంపట్టిన దర్పణాలు, ఉక్తివైచిత్రుల వలన వ్యక్తమయ్యే చమత్కారాలూ, తెలుగుదనం తొలకరించే తియ్యని అందాలూ, ప్రజల నాలుకలపై నిత్యవ్యవహారంలో క్రొత్త అర్థాలను సంతరించుకొన్న పోతన పద్యపాదాలూ–ఇలా ఎన్నో విశేషాలు నారాయణరెడ్డిగారి వ్యాఖ్యలో మెరుపుల్లా మెరుస్తున్నవి. కవితాత్మను దర్శించిన ఒక ప్రసిద్ధాధుని కాంధ్రకవి భక్తికవితాసుధానిధి యైన బమ్మెర పోతరాజు కవితాహృదయాన్ని ఆవిష్కరించిన లఘువ్యాఖ్యాగ్రంథ మిది. ఈ గ్రంథాన్ని ప్రచురింపగలగటం యువభారతి అదృష్టం.

ఈ ముందు మాటలను ముగించే ముందు మందారమకరందాల పద్య సంకలన విధానాన్ని గురించి ఒక విషయాన్ని మనవి చేయాలి. ఆంధ్రమహా భాగవతం పన్నెండు స్కంధాలలో వ్రాయబడిన మహాపురాణం. ఆంధ్రమహాభారతం వలెనే భాగవతం కూడా ఒక్క చేతిమీద నడవలేదు. అక్కడ ముగ్గురు కవులైతే ఇక్కడ నలుగురు కవులు. భాగవతరచనలో బమ్మెర పోతన్న ప్రధానుడు. భక్తిరసప్రధాన ఘట్టాలన్నీ ఆయన గంటంనుండే వెలువడి ఉండటం తెలుగువారి అదృష్టం. భాగవతంలో కొన్ని భాగాలను మరో ముగ్గురు కవులు అనువదించారు. వారిలో వెలిగందల నారయ ముఖ్యుడు. ఏకాదశ ద్వాదశస్కంధాలు పూర్తిగా, ద్వితీయ దశమోత్తరస్కంధాలలో కొంతభాగం ఆయన రచన. పంచమస్కంధం గంగన్న, షష్ఠమస్కంధం సింగన్న తెనిగించినారు. పోతన్న గతించిన తర్వాత శిథిలమైన భాగాలను ఈ ముగ్గురూ పూరించాలని, పోతన్నగారే వారిని ప్రోత్సహించి భాగవతరచనలో భాగం కల్పించారనీ, –ఎన్నో కథలూ, వాదాలూ ఉన్నాయి. ఇందులో రెండోవాదమే సత్యానికి సన్నిహితంగా ఉన్నదని పలువురి తలంపు. ఏమైనా ఇందులో ఎన్నిక చేసిన పద్యాలన్నీ పోతన్న భాగవతరచనంలోనివే. ప్రసిద్ధమైన పద్యాలు వందల కొద్దీ ఉన్నా–శిల్ప వైవిధ్యం దృష్టిలో ఉంచుకొని, పరిమితమైన పుటల్లో పరిమితమైన పద్యాల్నే–సామాన్యప్రజలకు మరీ సన్నిహితంగా ఉన్నవాటిని– ఎన్నుకోవటం జరిగింది.

ఆ పద్యాలను సంకలనం చేయటంలో భాగవతంలో ఉన్న క్రమాన్ని అంతటా పాటింపలేకపోయినా, ఒక సమన్వయ సూత్రంతో సంపుటీకరించటం జరిగింది. అవతారికలోని పద్యాలూ, పోతన కవితామాధుర్య విశేషాలను తెలిపే పద్యాలూ, అవతార కథల్లోని పద్యాలూ చివరకు శ్రీ కృష్ణావతారంలో బాలకృష్ణుని పరిణయ ప్రాభావాలు వర్ణించే పద్యాలూ - ఈ వరుసలో కూర్పు సాగింది. 'శ్రీ కైవల్య పదంబు జేరుటకునై..., అనే మంగళాశాసనంతో మొదలైన ఈ సంకలనం త్రివిక్రమావతారస్ఫూర్తితో విస్తరిల్లి, రుక్మిణీ కల్యాణంతో శుభాంతంగా ముగుస్తున్నది. 'మంగళాదీని మంగళమధ్యాని మంగళాంతాని కావ్యాన్ని ప్రథస్తే' అని కదా న్యాయం! ఈ సంకలనానికి ఈ సంవిధానం ఒక చక్కని క్రమపరిణామ రామణీయకత్వం సంతరిస్తున్నది.

యువభారతి వెలిగించిన మరో చిన్న దీపమిది, దీపం చిన్నదైనా దాని కాంతికిరణం గొప్పది:

# మందార
# మకరందాలు

1. *శ్రీ కైవల్యపదంబుఁ జేరుటకునై చింతించెదన్ లోక ర*
*క్షైకారంభకు భక్తపాలనకళా సంరంభకున్ దానవో*
*ద్రేక స్తంభకుఁ గేళిలోలవిలసద్దృగ్జాలసంభూతనా*
*నాకంజాత భవాండకుంభకు మహానందాంగ నాడింభకున్.*

శ్రీమదాంధ్ర మహాభాగవతంలోని మొదటి పద్య మిది. అంటే సంస్కృత నాటకాల్లోని నాందీశ్లోకం లాంటిది. కావ్య ప్రారంభంలో ఆశీస్సుగాని, నమస్సు గాని, కథాసూచనంగానీ ఉండాలని పెద్దల ఆదేశం. ఈ పద్యంలో నమస్కృతీ ఉంది, కథావిష్కృతీ ఉంది.

మహానందాంగనాడింభకుడు భాగవత కథానాయకుడు. అతని స్మరణం అంటే వస్తువరణమేకదా! ఇంతకూ, భాగవతాన్ని తెనిగించుమని ఆనతిచ్చిన వాడు రామభద్రుడు. కాని, ఈకృతి అందుకున్నవాడు నందనందనుడు. అందుకే పోతన్న ఆ నందకుమారుని అనంతముఖ అవతార రహస్యాల్ని ఈ పద్యంలో పొందుపరచినాడు. 'లోకరక్షైకారంభకు' దనడంలో పరమాత్మని స్థితికరత్వాన్ని – "భక్తిపాలన కళాసంరంభకు" దనడంలో గజేంద్రుని లాంటి ఆర్తులను ఆదుకునే గుణాన్ని– "దానవోద్రేక స్తంభకు" దనడంలో హిరణ్య కశిపుని వంటి రాక్షసప్రవృత్తులను అణగార్చే పనితనాన్ని – "కేళీలోల విల సద్దృగ్జాలసంభూత నానాకంజాతభవాండకుంభకు" దనడంలో ప్రధానంగా సృష్టిలీలను, కేళి శబ్దంచేత ఒకరకంగా కృష్ణలీలను ధ్వనింపజేసినాడు.

ఇంతటి మహార్థాన్ని ధ్వనింపజేస్తూనే పోతన్న తనకు వెన్నతోపెట్టిన పద్యవిద్యన మరువలేదు. "డింభకుణ్ణి" మనస్సులో అనుకున్నాడు. అందుకు అనుగుణంగా అనుగణంగా అందుకున్నాడు. "ఆరంభకున్" "సంరంభకున్" "స్తంభకున్" "కుంభకున్" అంటూ సమాసాంతంలో అంత్యప్రాసలు కూర్చే వింత విద్య ఇది. ఏమిటి దీని ప్రయోజనం? చెవికి చవులూరించే నాదసుఖం బిందుపూర్వక భకారాన్ని పునరుక్తంచేసి మహత్తరనాదాన్ని పూరించినాడు పోతన్న. పదం అర్థం పొందిన మధుర సమ్మేళనం ఈ పద్యం.

ఈ పద్యంలో పోతన్న ఆశిస్తున్నది ఏ కృతిభర్తకో విశ్వభర్త ఇచ్చే ఆశీస్సులు కాదు. అస లీకృతికి ఏ నరపతీ కృతిపతి కాదు –శ్రియఃపతి తప్ప. అంతటి సిరిదొరను అమాయకుడు అర్థించిం దేమిటి? కేవలం కైవల్యం, శరీర – ఇంద్రియ విముక్తమైన ఆత్మ కేవలమైనది. అది పొందేస్థితి కైవల్యం. ముముక్షువైన పోతన్న కాంక్షించేది కైవల్యమే. కాసులు కాదు.

2. *పలికెడిది భాగవతమఁట;*
*పలికించువిభుండు రామభద్రుం డఁట; నేఁ*
*బలికిన భవహర మగునఁట;*
*పలికెద వేఱొండుగాథఁ బలుకఁగనేలా?*

ఏదైనా ఒక విష్ణుకథ వ్రాయాలని కుతూహలంతో ఉన్నాడు పోతన్న. అప్పుడు కలలాంటి మెలకువలో కట్టెదుట నిలిచినాడు రామన్న. భాగవతం తెలుగుచేస్తే భవబంధాలు తెగుతాయని ఆనతిచ్చినాడు. పోతన్నకు అనుకున్న వస్తువు దొరికింది. కథేమో మహాభాగవతం. ఫలమేమో భవబంధ విమోచనం. విప్పారిన కనులతో వెరగుపడ్డ మనసుతో అనుకున్నాడు – పలికేది భాగవతమనీ, పలికించేశక్తి స్వీయం కాదు దివ్యమనీ; పలికితే కలిగే ఫలం తాను మొట్ట మొదట ఆశించిన కైవల్యమని. ఇంతకు మించిన సాఫల్యం ఏముంది? ఇంతకు మించిన కథ మరేముంది?

పండి మగ్గిన వ్యాస భాగవత ఫలం పోతన్నవంటి తెలుగుచిలుకలకు లభించడం దైవనియోగం. ఆంధ్రరసికుల అదృష్టయోగం.

3. *వేగకల్పవృక్షవిగళితమై శుక*
*ముఖసుధాద్రవమున మొనసియున్న*
*భాగవతపురాణ ఫల రసాస్వాదన*
*పదవిఁ గనుఁడు రసిక భావవిదులు.*

భాగవత పురాణం ఎలా అవతరించిందో, ఎలా వ్యాపించిందో సుమధుర రూపకంగా పొదిగి చూపిన పద్య మిది. భాగవతం ఒక ఫలం. అది వేద మనే కల్పవృక్షం నుంచి జారిపడింది. నేలమీద కాదు, శుకముఖంలో. ఆ సుధాద్రవంతో సురుచిరంగా భాసించే ఆ ఫలరసాన్ని ఆస్వాదించే పదవి రసిక భావవిదులది. కావ్యాస్వాదనకు రసికత్వం భావుకత్వం అవశ్యగుణాలు. ఈ పురాణఫలం ఆ అధికారులకే నిర్దేశించబడింది.

పోతన కూర్చిన ఈ రూపకమాలికలో "శుకముఖం" అనే సమాసం శ్లేషావాసం శుక యోగితోపాటు చిలుక తళుకు లొలకడం ఈ పద్యంలో సరికొత్త రుచులు చిలకడం.

మూల భాగవత శ్లోకఫలాన్ని పరమవిధేయంగా తెలుగువారి కందించినాడు పోతన్న.

4 *భాగవతము దెలిసి పలుకుట చిత్రంబు*
*శూలి కైనఁ దమ్మిచూలి కైన*
*విబుధ జనులవలన విన్నంత కన్నంత*
*తెలియవచ్చినంత తేటపఱుతు.*

రామాయణం, భారతం, భాగవతం – ఈ మూడు గ్రంథాలు భారతీయ సంస్కృతికి మూలబింబాలు. భారతీయుల కట్టూ, బొట్టూ, నడకా, నాణ్యం, ఆవేశం, ఆలోచన అన్నిటిపైన ఈ మూడుకావ్యాల ముద్ర ఉంది. ఈ మూడింటిలో రామాయణ భారతాలకంటె భాగవతం అర్థం చేసుకోవడం కష్టం. కారణం? ఇందుతో భక్తిపథంతోపాటు అక్కడక్కడ అతి జటిలమైన వేదాంతఘట్టా లుండడమే. శ్రీధరపండితుడు విడదీసిన చిక్కులను చూస్తేనేగాని ఒక పట్టాన ఇది అంతుపట్టదు. అందుకే పోతన్న విన్నవించుకున్నాడు– భాగవతాన్ని అర్థం చేసుకోవడం సులభం కాదని; తెలుసుకున్నదాన్ని తెలియజెప్పడం మాటలు కాదని. ఎవరికి? కవులకు మాత్రమేకాదు, ముగ్గురు మూర్తులలో అటు శివునికి ఇటు కమలభవునకీ కూడా. ఇక మధ్యలో మిగిలినవాడు మాధవుడు. భాగవతం ఆ మాధవుని కథే. ఆయనకథ తెలిసి పలకాలంటే ఆయనకే చెల్లుతుందేమో!

ఆ భగవత్తత్త్వాన్ని తాను పండితులవలన తెలుసుకున్నంత, తన దృష్టికి తెలియవచ్చినంత తేటపరుస్తానని పోతన్న చెప్పుకున్నాడు. మిగతా విబుధజనులెవ్వరో తెలియదుగాని వ్యాస భాగవతానికి వ్యాఖ్యానం వ్రాసిన శ్రీధరపండితుణ్ణి మాత్రం పోతన్న ఆసరాగా తీసుకున్నాడు. వేదాంత ఘట్టాల వివరణలో శ్రీధరీయవ్యాఖ్య పోతన్నపాలిటి సువర్ణ భిక్ష.

5. *ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చి పురంబులు వాహనంబులున్*
*సొమ్ములుఁ గొన్ని పుచ్చుకొని సొక్కి శరీరముఁ బాసి కాలుచే*
*సమ్మెట వాటులం బడక సమ్మతి శ్రీహరి కిచ్చి చెప్పె నీ*
*బమ్మెరపోతరా జొకఁడు భాగవతంబు జగద్ధితంబుగన్*

విశ్వశ్రేయం కవితాలక్ష్యం. దానిని డబ్బుకోసమో, డాబుకోసమో, ధనికులకో, అధికులకో అమ్ముకోవడం ఆత్మవంచనం. ఇది ప్రాయికంగా ఆధునిక దృక్పథం. ప్రయోగగర్భితమైన ఈ దృక్పథాన్ని అలనాడే ఉద్ఘోషించినాడు బమ్మెరపోతరాజు. నరాంకితాన్ని నిరసించడం అప్పటికి అపూర్వమే కాదు, సాహసోపేతం కూడా. ప్రభుస్వామ్య వ్యవస్థలో ప్రజాస్వామ్య దృక్కోణాన్ని ప్రదర్శించడం పోతరాజు స్వచ్ఛంద వ్యక్తిత్వానికి నిదర్శనం. మెత్త మెత్తగా కవిత్వం వ్రాయడానికి పేరువడ్డ ఈ కవి సుత్తెతో కొట్టినట్టు "మనుజేశ్వరాధముల"ను నిరసించినాడు. తాను నమ్మిన పరంధామునికే భాగవత కృతిని సమర్పించినాడు. ఆ సమర్పణంలో స్వార్థం లేదు. జగద్ధితమే–లోక హితమే దాని చరమార్థం.

పోతన్న అనగానే మొట్టమొదట గుర్తుకొచ్చే ఈ పద్యం అతనిది కాదనీ ఎవరో వ్రాసి చేర్చిందనే అభిప్రాయం కూడా లేకపోలేదు. వ్రాసిన దెవరైనా ఇందులో ప్రత్యక్షరంలో పోతన్న వ్యక్తిత్వమే సాక్షాత్కరిస్తున్నది.

6. *కొందఱికిఁ దెనుఁగు గుణ మగుఁ*
*గొందఱికిని సంస్కృతంబు గుణ మగు రెండున్*
*గొందఱికి గుణము లగు నే*
*నందఱి మెప్పింతుఁ గృతుల నయ్యైయెడలన్.*

నన్నయ మొదలుకొని ప్రాచీనాంధ్రకవులందరూ సంజాయిషీ ఇచ్చుకున్నారు. తాము తెలుగు–సంస్కృతం ఈ రెండు భాషల్లో సమర్థంగా కవిత లల్లగలుగుతా మని. ఎందుకు?

అప్పటికి కావ్యమంటే సంస్కృత కావ్యమే, పాండిత్య మంటే సంస్కృతపాండిత్యమే. అయినా, తెలుగులో కవిత్వాన్ని వెలయించా లని రాజరాజులాంటి పోషకులకూ, నన్నయలాంటి సాధకులకూ అపారమైన కోరిక. నన్నయ అన్నాడు- తాను "ఉభయభాషాకావ్య రచనాభిశోభితుడ"నని. తిక్కన చాటుకున్నాడు తన "ఉభయకావ్యప్రౌఢి"ని. ఈ పోతన్నకూడా విన్నవించుకున్నాడు "ఉభయ కావ్యకరణదక్షుడ"నని.

అయితే కొందరికి తెలుగు ఇష్టం. కొందరికి సంస్కృతం ఇష్టం. "నేను అందరినీ మెప్పిస్తాను" అని సమర్థించుకోవడమెందుకు? అప్పటికే పాలకురికి సోమనాథుడు "నావి తెలుగు మాటలు కావు వేదాలు" అని తాండవిస్తున్నాడు. "సంస్కృత భూయిష్ఠరచన" అందరికి అందుబాటులో ఉండదని హుంకరిస్తున్నాడు. ఇంకొకవైపు శ్రీనాథుడు తెలుగూ కాదు, సంస్కృతమూ కాదు "నా కవిత్వంబు నిజము కర్ణాటభాష" అని తన దారిని తాను నడుస్తున్నాడు. ఇంతకూ శ్రీనాథుడన్నది నిజమే. అయితే అతని భాష కర్ణాటభాషా? కాదు. తన కవిత్వం కర్ణాటభాష అన్నాడు. అంటే కన్నడంలోని కవితారీతులనూ - సంస్కృత సమాసధోరణులనూ-దేశిపదప్రయోగవైఖరులనూ తనలో ఇమిడించుకున్న కవిత్వం అని అతని అభిప్రాయమేమో!

ఎవ్వరేమనుకున్నా నాకేమి కొరత-అని ఈసడించే మనస్తత్వం కాదు పోతన్నది. లోకంలో భిన్నరుచులున్నాయి. కవితాలోకంలో ఎన్నెన్నో తెన్నులున్నాయి. నన్నయ్య మార్గరీతి ఉంది. సోమన్న దేశిరీతి ఉంది. ఈ రెంటికి అనుయాయులున్నారు. ఆ రెండు గుణాలను తనలో మేళవించుకున్న కావ్యశిల్పి పోతన్న.

ఈ పద్యంలో పోతన్న వినయమే కాదు; ఆత్మ విశ్వాసమూ ధ్వనిస్తున్నది.

7. *మందార మకరంద మాధుర్యమునఁ దేలు*
*మధుపంబు బోవునే? మదనములకు*
*నిర్మలమందాకినీవీచికలఁ దూఁగు*
*రాయంచ సనునె? తరంగిణులకు*
*లలితరసాలపల్లవఖాదియై చొక్కు*
*కోయిల సేరునే? కుటజములకుఁ;*
*బూర్ణేందు చంద్రికా స్ఫురిత చకోరక*
*మరుగునే? సాంద్రనీహారములకు*

*అంబుజోదర దివ్యపాదారవింద*
*చింతనామృతపాన విశేషమత్త?*
*చిత్త మేరీతి నితరంబుఁ జేరనేర్చు?*
*వినుత గుణశీల! మాటలు వేయునేల?*

సంస్కారాన్ని బట్టి మనసు, మనసు బట్టి మార్గం. ఆ మనోగతిని మళ్లించడం ఎవరికి సాధ్యం? భగవంతుని పాదాలను భజించడంలో మత్తెక్కిన చిత్తానికి మరోచింత ఉంటుందా? ఉండదు. ఆ ఉండదనే సత్యాన్ని నాలుగు రకాలుగా బహుముఖాలుగా చెప్పితేనేగాని పోతన్న మనసు నిండదు.

ఒక విషయాన్ని తీసుకుని అలంకారబలంతో వాక్యనిర్మాణకౌశలంతో నొక్కి నొక్కి చెప్పడం పోతన్నకు ఒంటపట్టిన గుణం. ఇది పాలకురికి సోమన్నలో ఉంది. ఆ పరిసరాలలో పుట్టిన బమ్మెరపోతనలోనూ ఉంది. ఇది వక్తృత్వశైలి (Rhetoric style). ఒక వక్త వేదికపై నిలిచి ఉద్ఘాటించేధోరణి. మందార మకరందాల తీపి మరగిన తుమ్మెద ఉమ్మెత్తపూలను చేరుకుంటుందా! ఆకాశగంగాతరంగాలలో ఉయ్యాలలూగే రాజహంస వాగులకూ వంకలకూ వెళుతుందా? తీయని మామిడి లేతచిగుళ్ళను తిని పరవశించే కోయిల కొండమల్లెలను కోరుకుంటుందా? పండు వెన్నెలబయళ్ళలో విహరించే చకోరం మంచుపొగలవైపు పోతుందా? లేదు లేదు. వీలు కాదు, వేయి మాటలెందుకు? పరమాత్ముని వలచిన మనసు మరోవైపు చేరుకోదు.

ఈ పద్యం భక్తికి పట్టుకొమ్మగా నిలిచింది. పోతన్న రచనాశక్తికి నిలువుటద్దంగా నిలిచింది. నిజానికిది–

*"క్షీరాబ్ధిలోపలఁ గ్రీడించు హంస,*
*గోరునే పడియల నీరు ద్రావంగ!"*

అనే పాలకురికి సోమన్న పద్య ప్రభావంతో పుట్టిందే, అయినా ఈ పద్యం పొందిన ప్రచారం అపారం. ఈ పద్యంతో కనీసం మొదటిపాదం రాని తెలుగువాడు దాదాపుగా లేనేలేడు. ఒకవేళ ఉంటే వాడు తెలుగువాడు కానేకాడు. ఇంతటి వశీకరణశక్తికి మూలకారణం మధురాక్షర సమ్మేళనం– "మందార", "మధుప", "మదనములు". ఒక్క పాదంలోనే ఇన్ని మకారాల గుబాళింపు. అందుకే ఈ పద్యం తెలుగువారి నోటి కెక్కింది.

ఈ ఒరవడిలో పోతన్న ఎన్నెన్నో పద్యాలను తీర్చిదిద్దుకున్నాడు.

"కమలాక్షు నర్చించు కరములు కరములు
శ్రీనాథు వర్ణించు జిహ్వా జిహ్వ"
"కంజాక్షునకు గాని కాయంబు కాయమే
పవనగుంభిత చర్మభస్త్రిగాక"
"సంసార జీమూత సంఘంబు విచ్చునే
చక్రిదాస్య ప్రభంజనము లేక"

8. కమనీయ భూమి భాగములు లేకున్నవే?
పడియుండుటకు దూదిపరుపులేల?
సహజంబులగు కరాంజలులు లేకున్నవే?
భోజనభాజనపుంజ మేల?
వల్కలాశాజినావళులు లేకున్నవే?
కట్ట దుకూలసంఘాత మేల?
గొనకొని వసియింప గుహలు లేకున్నవే?
ప్రాసాదసౌధాదిపటల మేల?

ఫలరసాదులు గురియవే? పాదపములు
స్వాదుజలముల నుండవే? సకలనదులుఁ
బొసఁగ భిక్షయుఁ బెట్టరే? పుణ్యసతులు
ధనమదాంధుల కొలువేల? తాపసులకు.

ప్రాయోవేశంలో ఉన్న పరీక్షితునికి శుక యోగి భక్తిజ్ఞానమార్గాలను ఉపదేశిస్తున్నాడు. సంసారం మనం తెచ్చిపెట్టుకున్నది; కృత్రిమమైనది; ప్రకృతి స్వతస్సిద్ధమైనది. సహజ సౌఖ్యదాయక మైనది. నిలువడానికి నేల నిస్తుంది. కట్టుకోవడానికి నారచీరలిస్తుంది. నివసించడానికి గుహలను చూపుతుంది. తిని, త్రాగి, జీవించడానికి ఫలాలనూ జలాలనూ అందిస్తుంది.

మరి సంసారవలయం ఏం చేస్తుంది? దూదిపరుపులను, పసిడిపాత్రలను జిలుగు వలువలను, తళుకుమేడలను ఎర చూపుతుంది. రెంటికీ ఎంత వ్యత్యాసముంది?

తాపసి-అంటే యోగి, ఈ వ్యత్యాసాన్ని అవగతం చేసుకుంటాడు. సంసార వలయంలో బుసకొట్టే సంపన్నుల కొలువు తన కెందుకని నిర్ణయించుకుంటాడు. పుణ్యసతులు పెట్టే భిక్షానుభవంతోనే ధన్యతను గణించుకుంటాడు. యోగుల అంతః కరణానికి ప్రతిబింబం ఈ పద్యం.

నిరాడంబర జీవితానికి పోతన్న ప్రతినిధి అని తెలుగునాట తరతరాలుగా ప్రచారంలో ఉన్న అభిప్రాయానికి ఈ పద్యం ఒకరకంగా అంతస్సాక్ష్యం కూడా.

*9.* *చేతులారంగ శివునిఁ బూజింపఁడేని*
*నోరు నొవ్వంగ హరికీర్తి నుడువఁడేని*
*దయయు సత్యంబు లోనుగాఁ దలఁపఁడేనిఁ*
*గలుగ నేటికిఁ దల్లుల కడుపు చేటు.*

శివుని పూజించడం, హరిని కీర్తించడం, దయనూ సత్యాన్నీ ధర్మాలుగా భావించడం జన్మసాఫల్యానికి సాధనాలని పోతన్న విశ్వాసం. ఇవి లేనివాని జీవితం వ్యర్థం. వ్యర్థుణ్ణి ఈసడించడానికి "వాడు తల్లికడుపు చెడబుట్టినా"డని నేటికీ వాడుతుంటాం. ఇది నాటి వాడుక కూడా. "కడుపుచేటు" అన్న నుడికారం పాఠకుల గుండెల్లో సూటిగా దూసుకుపోయే రామబాణం.

శివకేశవుల అద్వైతాన్ని వ్యంగ్యంగా ప్రతిపాదించడం ఈ పద్యంలోని మరొక విశేషం.

*10.* *ఒక సూర్యుండు సమస్త జీవులకుఁ దానొక్కొక్కఁడై తోఁచుఁ బో*
*లిక నేదేవుఁడు సర్వకాలము మహాలీలన్ నిజోత్పన్నజ*
*న్యకదంబంబుల హృత్సరోరుహములన్ నానావిధానూహరూ*
*పకుఁడై యొప్పుచునుండు నట్టి హరినేఁ బ్రార్థింతు శుద్ధుండ నై.*

సూర్యుడొక్కడు; జీవులు పెక్కురు. ఆ ఒక్క సూర్యుడే ప్రతిజీవికి ఒక్కొక్కడుగా కనిపిస్తాడు. భగవంతు డొక్కడే! అతణ్ణి భావించే హృదయాలు అనేకాలు. ప్రతిహృదయానికి ఒక పరమాత్ముడు భాసిస్తాడు. సూర్యుడు కనిపించడం స్థూలదృష్టి. భగవంతుడు భాసించడం సూక్ష్మదృష్టి. తాత్త్విక విషయాన్ని అరటిపండొలిచినట్టు బోధించిన పద్యమిది.

11. త్రిజగన్మోహన నీలకాంతి తను వుద్దీ౦పింప బ్రాభాతనీ
రజబంధు ప్రభ మైన నిలము పయిన్ రంజిల్ల నీలాలక
వ్రజసంయుక్త ముఖారవింద మతిసేవ్యం బై విజృంభింప మా
విజయుం జేరెదు వన్నెకాఁడు మది నాశించు నెల్లప్పుడున్.

భీష్ముని హృదయపటంలో చిత్రిత మైన శ్రీకృష్ణుని వర్ణచిత్ర మిది. ఈ కృష్ణుడు విజయసఖుడు. నీలాకాశమే తనువుగా, భాను ప్రకాశమే పీతాంబరంగా ఉద్భాసించే విశ్వమూర్తి తన మనమును ఎల్లప్పుడూ ఆవేశించాలని ఆ పితామహుని ఆశయం.

ఈ పద్యానికి వన్నె తెచ్చిన ప్రయోగం శ్రీకృష్ణుణ్ణి "వన్నెకాడు" అన్న తెలుగుపదం. పైన "త్రిజగన్మోహన నీలకాంతి", "ప్రాభాతనీరజ బంధుప్రభము", "నీలాలక వ్రజసంయుక్త ముఖారవిందం" వంటి సులలిత సంస్కృత సమాసాలతో తరగెత్తిన పద్యంలో "వన్నెకాడు" అన్న ఆ చిన్నిమాట పైకి తేలిన నురుగు పువ్వు.

12. మన సారథి, మన సచివుఁడు
మన వియ్యము, మన సఖుండు, మన బాంధవుఁడున్
మన విభుఁడు, గురువు, దేవర
మనలను దిగనాడి చనియె మనుజాధీశా!

ద్వారకనుంచి తిరిగివచ్చిన అర్జునుడు పెన్నిధిని కోల్పోయిన పేదవలె నిట్టూరుస్తూ అన్నతో అన్న పద్యమిది. కృష్ణుడు పాండవులను నడిపించినవాడు. ఉపాయాలు ఉపదేశించినవాడు. వియ్య మందుకున్నవాడు. నేస్తం నెరపినవాడు. చుట్టరికం కలసిన వాడు, పైగా వారికి గురుడు. అన్నింటినీ మించి దేవునిలాంటి వాడు. అంతటి ఆత్మహితుడు అస్తమించినవార్తను ఎంతో కరుణావిలంగా అందించిన పద్యమిది.

అయితే కాలం గడిచినకొద్దీ ఈ పద్యం వేనోళ్ళతో వికసించింది. కృష్ణ పాండవుల పరిధిని దాటి సమస్త మానవుల దైనందిన వ్యవహారంలోకి ప్రవేశించింది. మిత్రుడో, ఆప్తుడో, బంధువో, ఒక సంఘ సేవకుడో, ఒక దేశనాయకుడో పరమపదించినపుడు అప్రయత్నంగా ఈ పద్యం తెలుగువాని గుండెలో మెదులుతుంది. కొండంత దుఃఖానికి అద్దంపట్టి చూపుతుంది.

ఒక చిన్న కందంలో ఎన్నెన్ని బంధాలను ముడివేసినాడు పోతన్న! అందుకే తెలుగన్నలనాల్కలపై కలకాలం నిలిచిపోతుంది.

13. *ఎవ్వనిచే జనించు జగమెవ్వనిలోపల నుండి లీన మై*
*యెవ్వనియందు డిందుఁబరమేశ్వరుఁ డెవ్వఁడు మూలకారణం*
*బెవ్వఁ డనాదిమధ్యలయుఁడెవ్వఁడు సర్వముఁ దాన యైనవాఁ*
*డెవ్వఁడు వాని నాత్మభవు నీశ్వరు నే శరణంబు వేఁడెదన్.*

మకరి నోట చిక్కిన కరిరాజు సొంతకాళ్ళపై నిలబడి వెయ్యేళ్ళు పోరాడినాడు. చివరికి నీరసించినాడు. నిట్టూర్చినాడు. ఏ దిక్కూ తోచక దిక్కులకే దిక్కైన సర్వేశ్వరుణ్ణి శరణు వేడినాడు.

ఆ సర్వేశ్వరుని మూలతత్త్వం ఈ పద్యంలో ఎన్నో దళాలతో విప్పారింది. ఇందులోని "ఎవ్వడు" అవ్యక్తుడు. ఆ అవ్యక్తరూపుణ్ణి వ్యక్తపరచడానికి "ఎవ్వడు" అనేమాట ఎన్నో విభక్తులతో రూపుదిద్దుకుంది. అదే ఈ పద్యంలోని విశిష్టత.

14. *లోకంబులు లోకేశులు*
*లోకస్థులుఁ దెగిన తుది నలోకం బగు పెం*
*జీఁకటి కవ్వల నెవ్వఁడు*
*నేకాకృతి వెలుఁగు నతని నే సేవింతున్*

పగలు వెలుగు. రాత్రి చీకటి. ఇదే నిత్యనైమిత్తిక భ్రాంతి. సృష్టి మొత్తం చీకటి. లోకాలు, లోకులు, లోకేశ్వరులు ఆ పెనుచీకటికి మారురూపులు. ఉన్నది ఒకే ఒక్క పరంజ్యోతి. అది ఒక్కటే అనశ్వరమైన ఆకృతి. ఆ వెలుగే తనకు శరణ్యమని గజేంద్రుని దృఢసంకల్పం.

15 *కలఁ డందురు దీనులయెడఁ*
*గలఁ డందురు పరమయోగిగణములపాలం*
*గలఁ డందు రన్ని దిశలను*
*గలఁడు కలం డనెడువాఁడు కలఁడో లేఁడో.*

గజేంద్రుడు ప్రస్తుతం ఆర్తుడు. ఆర్తిలో అచ్చమైన సత్యమూర్తి పొగలు పొగలుగా పొరలు పొరలుగా కనిపిస్తుంది. భగవంతుడు అంతటా ఉన్నాడని అంటారు. అలా అనగా ఇతడు విన్నాడు. త్రికరణశుద్ధిగా నమ్మి ఉన్నాడు. అయినా అప్పటి జంజాటంలో ఆ జీవిబుద్ధిని సంశయం కమ్ముకుంది. 'కలడు కలండనెడువాడు కలడోలేడో' అని గుంజుకున్నాడు ముడులువిడని ఆ సంశయాత్ముడు. ఈ సంశయాత్ముడు ఇలా సతమతమవుతూ ఉంటే ఆ నిశ్చయాత్ముడు ప్రహ్లాదుడు సర్వేశ్వరుని ఉనికి విషయంలో "సందేహము వల్ద" దని చాటిచెప్పినాడు. ఇదీ ఈ ఇద్దరిమధ్యలో ఉన్న తేడా.

ఒక్క గజేంద్రుడే కాదు. ఈ లోకంలోని కోటానుకోట్ల జీవులు అప్పుడూ ఇప్పుడూ ఈ పెనుగులాటతోనే సతమత మవుతున్నారు – పరమాత్ముని అస్తిత్వాన్ని నిరాకరించలేక, నిశ్చయించలేక.

పరమ గభీరమైన ఈ బ్రహ్మజిజ్ఞాసను చిన్న చిన్న మాటలలో ఎత్తి చూపి, పామరులకుకూడా పరమాత్మతత్త్వాన్ని అందజేసినాడు పోతన్న.

16. *లావొక్కింతయు లేదు, ధైర్యము విలోలం బయ్యెc, బ్రాణంబులున్.*
*ఠావుల్ దప్పెను, మూర్ఛ వచ్చెc, దనువున్ డస్సెన్, శ్రమంబయ్యెడిన్.*
*నీవే తప్ప నితఃపరం బెరుcగ, మన్నింపం దగున్ దీనునిన్*
*రావే యీశ్వర! కావవే వరద సంరక్షించు భద్రాత్మకా!*

గజేంద్రుడు అనేక గజసమూహాలకు అధిపతి. దశలక్షకరిణీగణానికి పతి. ఉద్ధామవైభవంతో విశృంఖలంగా విహరించే ఆ కరివరుడు విధివశాన మకరినోట చిక్కువడినాడు. హోరాహోరిగా అహోరాత్రాలు పోరాడినాడు. మకరిని గెలుస్తానన్న అహం సన్నగిల్లింది. స్వశక్తిపైని విశ్వాసం సడలిపోయింది. లోకేశ్వరుని వైపు చూపు మళ్ళింది.

ఒకదశలో అతడున్నాడో లేడో అను అనుమానం పొడసూపింది. "సంశయాత్మా వినశ్యతి," అయితే ఈ భక్తుడు ఆ కోవకు చెందినవాడు కాదు. వెంటనే తేరుకున్నాడు. సందేహాంధకారం నుంచి మేలుకున్నాడు. శరణమే తరణోపాయ మని నిర్ణయించుకున్నాడు. అతని అశక్తిని నివేదించుకున్నాడు. "నీవే తప్ప నితఃపరం బెరుగ" (త్వమేవ శరణం మమ)నని తనను తానే అర్పించుకున్నాడు. భగవదనుగ్రహానికి శరణాగతి తప్ప మరొక మార్గం లేదని నిశ్చయించుకున్నాడు. ఫలితం? పరమాత్మ సాక్షాత్కారం; మొసలికోరలవంటి భవ బంధాలనుంచి విమోచనం.

ఈ పద్యంకూడా తెలుగువాళ్ళు అనేక సందర్భాల్లో సందర్భోచితంగానూ, సందర్భరహితంగానూ వాడుకుంటున్నదే. "నీవే తప్ప ఇతఃపరం బెరుగ" అని పరమలౌకిక ప్రయోజనాలకు కూడా ఉపయోగిస్తుంటారు. కొలిచే పెత్తందారు పట్లనే కాదు, వలచే ప్రియురాలిపట్లకూడా. ఇక ఏ దిక్కూ లేనప్పుడు "లావొక్కింతయులే" దని తెలుగువాని నాలుక విలవిలలాడక తప్పదు. అంతేకాదు. అరాజక స్థితి చెలరేగే సమకాలీన సమాజాన్ని చూస్తే కొందరికి 'law ఒక్కింతయులేద'ని అనిపించక పోదు.

17. *అల వైకుంఠపురంబులో నగరిలో నామూలసౌధంబు దా*
*పల మందార వనాంతరామృత సరః ప్రాంతేందుకాంతోపలో*
*త్పలపర్యంక రమావినోది యగు నాపన్న ప్రసన్నుండు వి*
*హ్వల నాగేంద్రము 'పాహి పాహి' యనఁ గుయ్యాలించి సంరంభియై.*

గజేంద్రుడు మొరపెట్టుకునే సమయంలో ఆ దేవదేవుడు ఏ స్థితిలో ఉన్నాడో వర్ణించడం ఈ పద్యంలోని చిత్రం. ఒక్కమాటలో చెప్పాలంటే ఆ మహావిష్ణువు అప్పుడు రమాసాంగత్యంలో తేలియాడుతున్నాడు.

కాని, మూడు ముక్కల్లో ముడిచి చెప్పడం పోతన్న పద్ధతి కాదు. రసకేళీ పరవశుడైన ఆ రమాధవుని స్థితికి ఒక చలనచిత్రాన్ని రూపొందించినాడు; కనులముందు అతనికి కదలాడేటట్టు చూపినాడు.

అల వైకుంఠపురం; ఆ పురంలో అంతఃపురం; అందులో ప్రధానసౌధ సమీపంలో అమృతసరోవరం; అక్కడ చంద్రకాంత వేదికపై కలువల పాన్పు; ఆ పాన్పుపై క్రీడిస్తున్న నారాయణుడు – ఇదీ పోతన్న కట్టిన చిత్రతోరణం.

ఇంత వివరంగా ఎందుకు చిత్రించినట్లు? ఎవరు మొరపెట్టినా ఎంతగా తలుపు తట్టినా లెక్కింపని స్థితి అది. ఎక్కడో గజేంద్రుడు ఆక్రందిస్తుంటే ఇక్కడ ఇంతటి రసపారవశ్యంలో ఉన్న స్వామి సంరంభించడం సామాన్యం కాదు. జీవాత్మ పరమాత్మల మధ్య ఉన్న అంతులేని అఘాతాన్ని, అపార వ్యత్యాసాన్ని ఎంతో మెలకువతో చిత్రించినాడు. అతడు రమావినోదియైనా ఆర్తుని మొరవిని పరుగెత్తడానికి కారణం ఒక్కమాటలో సూచించినాడు కవి. అదే "ఆపన్న ప్రసన్నుండు" అనేది. ఎక్కడున్నా జనార్దనుడు

ఆర్తత్రాణపరాయణుడే. గజేంద్రుడున్న కరుణావస్థకు, ఉపేంద్రుడున్న శృంగారరసస్థితికి మధ్య ఆర్తి ఒక సేతువైంది.

అదే ఈ పద్యంలోని కొసమెరుపు.

*18 సిరికిం జెప్పఁడు శంఖచక్రయుగముం జేదోయి సంధింపఁ డే*
*పరివారంబును జీరఁ, డభ్రగపతిం బన్నింపఁ, డాకర్ణికాం*
*తర ధమ్మిల్లముఁ జక్క నొత్తఁడు, వివాదప్రోద్ధిత శ్రీకుచో*
*పరిచేలాంచల మైన వీడఁడు గజప్రాణావనోత్సాహి యై.*

శ్రీమన్నారాయణుడు స్థితికారుడు. స్థితి శిష్టరక్షణలో ఉంది. అందుకే ఆ మహాప్రభువు అంతగా సంరంభించినాడు. అర్ధాంగితో నైనా ఆమాట చెప్పలేదు. పోనీ... సమరసామగ్రినైనా సమకూర్చుకోలేదు. గబుక్కున వెళ్ళాలంటే గరుడవాహనం అవసరం కదా! అదీ అవసరం అనిపించలేదు ఆ ఆపన్న ప్రసన్నునికి. ఇంతకూ సాధురక్షణకు సాధనాలతో నిమిత్తమేమి? భక్త పోషణకు పరివారంతో అవసరమేముంది? నిజమే. ఆ విశ్వపతికి ఇవేవీ అక్కరలేదు. నిస్సహాయుడుగా నిరాయుధుడుగా దుష్టసంహారం చేయగలుగుతాడు. కాని, ఉన్న చిక్కంతా అతని చేతిలోనే ఉంది;– ఆ చేతికి చిక్కుపడిన చేలాంచలంలో ఉంది, తనకు చెప్పకుండా ఆయన వెళ్ళిపోయినా ఆయమ్మ కాదనలేదు. కాని, ఆయన చేతిలో ఉన్న తన చేల చెరగు మాటేమిటి? "ఇదేమిటీ" అని అడిగితే వినే స్థితిలో ఉన్నాడా ఆ వెర్రినాయన మరి అడగకుండా తానెలా ఉండగలుగుతుందంటారు?

*19. అడిగెద నని కడువడిఁ జను;*
*నడిగిన దను మగుడ నుడుగఁడని నడ యుడుగున్;*
*వెడవెడ సిడిముడి తడఁబడ*
*నడుగిడు నడు గిడదు జడిమ నడుగిడునెడలన్.*

"అడగాలా వద్దా?" అనే తడబాటును సూచించే పద్య మిది. అప్పటి ఆందోళనకు తగ్గ అక్షరాల పోహళింపు ఈ పద్యంలోని సొంపు. దీన్ని సర్వ లఘుకంద మంటారు. ఇందులో అన్నీ లఘువులే. సర్వలఘువుల సంతరింపు భావోద్వేగానికి ముక్తాయింపు.

అంతమాత్రాననే ఈ పద్యం అందగించలేదు. నుడుల నడకలో "డ"కారం ప
పదే సవ్వడించడం ఈ పద్యంలోని మేలిగుణం. తెలుగుభాష తెలియని వానికి కూడా ఈ
పద్యం వింటే డకార పునరుక్తి చెవికి తగిలి ఏదో హడావిడీ, గడబిడ ఉన్నట్లు స్ఫురించ
మానదు.

ఒకే అక్షరాన్ని తిరిగి తిరిగి ప్రయోగించి ఉద్దిష్టభావానికి ఊత సాధించడం ఈ
పద్యంలో పోతన్న చేసిన గారడీతనం.

*20. గొడుగో, జన్నిదమో, కమండలువొ, నాకున్ ముంజియో, దండమో*
*వడు గే నెక్కడ భూములెక్కడ? కరుల్ వామాక్షు లశ్వంబు లె*
*క్కడ? నిత్యోచితకర్మ మెక్కడ? మదాకాంక్షా మితం బైన మూఁ*
*డడుగుల్ మేరయ త్రోవ కిచ్చుటయె బ్రహ్మాండంబు నాపాలికిన్*

అడిగేవాడు వామనమూర్తి, ఇచ్చేవాడు బలిచక్రవర్తి. ఒకటి రెండడుగుల నేల ఇమ్మ
ఆ వడుగు అడుగగా బలి అంటాడు– "పసివాడా! నీకు అడగడం కూడా చేతకాదు
పోనీ నీకు చేతకాకుంటే దాత పెంపుసొంపులను తలపవద్దా? వసుధాఖండమో, గజముల్
గజగమనలో కావాలని అడగాలె కాని ముష్టి మూడడుగులు అడగడ మేమిటి?" అని
అప్పుడు చిరునవ్వు చిప్పిలగా ఆ గృహమేధికి ఈ మేధావి బదులు పల్కిన పద్యమిది.

కరులూ, హరులూ, సిరులూ, సుందరులూ, సంసారులకు తానో బ్రహ్మచారి
తాను కోరేది గొడుగో జన్నిదమో కమండలువో యోగదండమో. ఆ మూడడుగులే త
పాలిటి బ్రహ్మాండం మరి! మూడడుగుల్లో ముల్లోకాలను ముడివేసిన గడుసుదనం
మాయావటునిది.

వామనుని త్రివిక్రమత్వాన్ని సుతారంగా స్ఫురింపజేసే వస్తుధ్వని ఈ పద్యంల
ఉంది.

*21. వారిజాక్షులందు, వైవాహికములందుఁ,*
*బ్రాణ విత్త మానభంగమందుఁ,*
*జకిత గోకులాగ్ర జన్మరక్షణమందు*
*బొంకవచ్చు నఘము; పొంద దధిప!*

'జీవాత్మకు అనృతమే మూలం' అనేది శుక్రనీతికి మూలం. దాని విస్తరణమే ఈ పద్యం. ఏమాత్రం బొంకవలసివచ్చినా 'వారిజాక్షులందు వైవాహికములందు' అంటూ సమర్థించుకోవడం సర్వసామాన్యంగా చూస్తున్నాం. ఏ వేళ ఏ లీల ఆచార్య శుక్రుడు ఉపదేశించినాడో కాని ఇది తెలుగునేల ఇప్పటికీ అబద్ధాలాడడానికి ఆధారంగా నిలిచిపోయింది. బొంకవలసిన సందర్భాలను చూస్తే, వాటిని మినహాయిస్తే, ఇక అబద్ధా లాడవలసిన అవసరం ఎవరికీ ఉండదు. అదే శుక్రనీతిలోని చమత్కృతి.

22. *కారే రాజులు? రాజ్యముల్ గలుగవే? గర్వోన్నతిం బొందరే?*
*వా రేరీ? సిరి మూట గట్టుకొని పోవంజాలిరే? భూమిపైఁ*
*బేరైనం గలదే? శిబిప్రముఖులుం బ్రీతిన్ యశఃకాములై*
*యీరే కోర్కులు? వారలన్ మఱచిరే యిక్కాలమున్ భార్గవా!*

బలిచక్రవర్తి యశస్వి. రాక్షసరాజైనా సత్యమూర్తి. తనువు నశ్వరతను, సిరుల అస్థిరతను ఎరిగిన జ్ఞాని. అందుకే శుక్రాచార్యుల వక్రనీతికి సూటిగా బదులు చెప్పగలిగినాడు. "పలికి బొంకడం కంటె పాపం లేద"న్నాడు. ఎంద రెందరో రాజులున్నారు. ఎన్నెన్నో రాజ్యా లేలినారు. ఉన్నంతకాలం మిడిసిపడ్డారు. ఏమైంది చివరికి? పోయేటప్పుడు కూడబెట్టుకున్న సిరి మూటగట్టుకొని పోలేదు. భూమిపై వారి పేరైనా మిగులలేదు. కాని, శిబిచక్రవర్తిలాంటి కొందరు ధర్మజ్ఞులున్నారు. వారు అన్యులకొరకు ఆత్మార్పణం చేసుకొన్నవారు. అన్ని కాలాలకూ చెన్ను చెదరని కీర్తివారిది. వారు నడచిన పుణ్యపథమే తనది.

ఈ పద్యానికి ఎనలేని సొగసు ఎత్తుగడ. రాజులుండిరి రాజ్యములేలిరి అన్నధోరణిలో ఎత్తుకుంటే పద్యాని కింత బిగువు వచ్చేదికాదు. ఒట్టివచనంలో వట్టిపోయేది. 'కారే రాజులు' అని క్రియతో ప్రారంభించడం వాక్యవక్రత. వక్రత లోనే కదా కవిత్వం తొంగిచూసేది! అందుకే ఈ పద్యం పదుగురికి పట్టువడింది.

'కారే', 'వారేరీ', 'పేరైనన్' అంటూ ప్రాస స్థానంలో జంగ సాచి సాగి పోయిన మూడు ముక్తాయింపులవల్ల ఈ పద్యం మరింత హృద్యంగా తయారైంది. ఈ పద్యంలో మిగతామాటల్ని మరచిపోయినా ఈ మూడుమాటలు విధిగా గుర్తుంటాయి. ఈ గుర్తే పోతన్న కీర్తికి మూలరహస్యం.

"సిరిమూట గట్టుకొని పోవడం" తరతరాలుగా మిగిలిపోయిన నుడికారం. అప్పటికీ వాడుకలో ఉన్న పలుకుబడి ఇది. నాడు వాడుకలో ఉన్నమాట పోతన్న కృతి కెక్కిందో పోతన్న వాడడంవల్ల ఈ నుడికారం నేటి వ్యవహారంలో వాసి కెక్కిందో... ఏమో మరి.

*23.* *ఇంతింతై, వటుఁడింతయై, మఱియు దానింతై నభోవీథిపై*
*నంతై, తోయద మండలాగ్రమున కల్లంతై, ప్రభారాశిపై*
*నంతై, చంద్రుని కంతయై, ధ్రువునిపైనంతై, మహర్వాటిపై*
*నంతై, సత్యపదోన్నతుండగుచు బ్రహ్మాండాంతసంవర్ధి యై.*

*24.* *రవిబింబం బుపమింపఁ బాత్రమగు-ఛత్రం బై, శిరోరత్న మై,*
*శ్రవణాలంకృతమై గళాభరణ మై, సౌవర్ణకేయూర మై,*
*ఛవిమత్కంకణ మై, కటిస్థలి నుదం ఛద్ఘంట యై, నూపుర*
*ప్రవరంబై, పదపీఠ మైవటుఁడు దా బ్రహ్మాండమున్నిండుచోన్.*

ఒకే పాదులో పుట్టినవి ఈ రెండు పద్యాలు. ఈ రెంటిలోనూ వామనమూర్తి ధరిస్తున్న విశ్వరూపమే వర్ణించబడింది.

మొదటి పద్యంలో గగనవీధి మొదలుకొని సత్యలోకందాకా ఆ పొట్టి వడుగు పొందిన విరాడ్రూపం చిత్రించబడింది. వటుడు ఆకాశాన్ని, మబ్బులను సూర్యచంద్రులను, ధ్రువుణ్ణి, మహర్లోకాన్ని క్రమక్రమంగా దాటిపోతున్నాడు. ఈక్రమాన్ని చెప్పడంలో అద్భుతత్వం ప్రధానతత్త్వం. అందుకు సరిపడే తెలుగు నుడులను అందుకున్నాడు పోతన్న. 'ఇంతై', 'అంతై', 'ఇంతై', 'అంతై', 'అంతై', 'అంతై' అన్న అచ్చ తెలుగు పరిమాణ వాచకాలను కొలమానాలుగా స్వీకరించి ఆ బ్రహ్మాండాంత సంవర్ధకుని స్వరూపాన్ని సమర్థంగా వర్ణించాడు. కానీ, ఈ వర్ణన చదువుతూ ఉంటే సామాన్య పాఠకునికి మతి చెదిరిపోతుంది. ఎక్కడ నభోవీధి? ఎక్కడి ధ్రువలోకం? ఎక్కడి మహర్లోకం? ఎక్కడి బ్రహ్మపదం? చిక్కులో పడిపోతాడు జిజ్ఞాసువు. తలనిండా ఆ త్రివిక్రమావతారమే ప్రళయాభీలంగా ఆక్రమించుకుంటుంది. బుర్రలో బొమ్మ నిలువదు. అందుకే అందుకున్నాడు రెండోపద్యం.

నిదానంగా, దృశ్యచిత్ర ప్రధానంగా త్రివిక్రమాకృతిని తీర్చిదిద్దినాడు. ఇప్పుడు చూడండి. అంచెలంచెలుగా భిన్న భిన్నావస్థల్లో వటుడు పొందిన క్రమవర్ధనం...

అదుగో?... అంబరాలను దాటి ఎదిగిపోతున్న వామనుడు, అతనికి గొడుగుగా నిలిచిన సూర్యుడు. మరీ మరీ పెరుగుతున్నాడు. అదే సూర్యబింబం భాసించింది - శిరోమణిగా, కర్ణభూషణంగా, కరకంకణంగా, మేఖలా ఘంటికగా, చరణనూపురంగా, చివరికి పదపీఠికగా.

ఈ పద్యంలో చెప్పదలచుకున్నది వామనుని క్రమపరిణామం. అందుకు సూర్యబింబం ఒక ప్రమాణం. ఆ ప్రమాణ స్థిరంగా నిలచి ఉంది. ఈ పరిణామం అనుక్షణం ఊర్ధ్వముఖంగా వర్ధిల్లుతూ ఉంది. వామనుని వ్యాపకత్వం ఒక్కమాటు జరిగింది కాదు. అవస్థాభేదంతో అతిశయించిన ఆకృతి అది. ఆ రూపానికి పోతన్న కట్టిన బొమ్మలు చలనశీలాలూ చైతన్యమూలకాలూ. ముందటి పద్యంతో మతిచెదిరిన పాఠకుడు ఈ పద్యంతో తేరుకుంటాడు. బ్రహ్మాండమైన ఒక దివ్యరూపాన్ని కనులముందు నిలుపుకుంటాడు.

ఈ ఉల్లేఖం మూలభాగవతంలో లేదు. ఇవి వ్యాసుడు గీసిన బొమ్మలు కావు. పోతన్న కవితాత్మలో మెదిలిన సువర్ణచిత్రచ్ఛవులు.

'ఇంతింతై వటుడింతయై' అన్నప్పుడు నాటి వటుని త్రివిక్రమత్వమే కాదు, నేటి ఒక సామాన్యుని అసామాన్యవృద్ధి కూడా స్ఫురిస్తుంది. 'అబ్బో! ఏమి చెప్పమంటారు? మావాడు 'ఇంతింతై వటుడింతయై' అన్నట్లుగా పెరిగి పోతున్నాడు' - అని లోక వ్యవహారంలో వినిపిస్తున్నది.

ఈ విధంగా పద్యపాదాలు నానుడులుగా మారిపోవడం ప్రజాకవిగా పోతన్న పొందిన ప్రత్యేకస్థానానికి నిదర్శనం.

*25. ఊరక రారు మహాత్ములు;*
*వా రథముల యిండ్లకడకు వచ్చుట లెల్లం*
*గారణము మంగళములకు;*
*నీ రాక శుభంబు మాకు; నిజము మహాత్మా!*

వసుదేవుడు తన పురోహితుడైన గర్గుణ్ణి వ్రేపల్లెకు పంపిస్తాడు. నంద నందనుని కుశలము తెలుసుకుని రమ్మని. అతనికి సముచిత సత్కారములు చేసి నందుడన్న మాటలివి.

'పెద్దలు ఊరకరారు. వారు సామాన్యుల ఇండ్లకు రావడం సర్వశుభాలకు కారణం.'

ఇంతే. ఈ పద్యంలో మరే విశేషమూ లేదు. అయితే ఈ పద్యం ఎందుకు ఎన్నికైనట్టు? 'ఊరక రారు మహాత్ములు' అనే మొదటిపాదం ఒక లోకోక్తిగా మారడంవల్ల. చిత్ర మేమిటంటే ఇది పోతన్న పద్యపాదమని చాలా మందికి తెలియక పోవడం. ఇంకొకచిత్ర మేమిటంటే ఇది ఆ నందుడు పరమ భక్తియుతంగా ప్రయోగించిన అర్థం. సగం మరుగునపడి కాస్త వెటకారాన్ని తనలో కలుపుకోవడం. ఏమైతే నేమి? ఈ లోకోక్తి మన తెలుగు పలుకుబళ్ళతో పాటు పచ్చగా నేటికీ జీవిస్తున్నది.

*26. చదివించిరి నను గురువులు;*
*చదివితి ధర్మార్థముఖరశాస్త్రంబులు; నేఁ*
*జదివినవి గలవు పెక్కులు;*
*చదువులలో మర్మ మెల్లఁ జదివితిఁ దండ్రీ!*

•

మోక్ష విద్య తప్ప తన కొడుకు అన్ని విద్యలు చదవాలని హిరణ్యకశిపుని ఆకాంక్ష. మోక్షాన్ని గూర్చి బోధించే చదువే చదువని ప్రహ్లాదుని ప్రగాఢ విశ్వాసం. ఈ సంగతి అప్పటికి తండ్రికి తెలియదు. అడుగుతున్నాడు తనయుడు నేర్చిన విద్యావిశేషాలేమిటని - ఒక్క పద్యం చెప్పి అర్థతాత్పర్యాలు వివరించుమని. చదివినవి పెక్కుశాస్త్రాలైనా చదువులసారం ఒక్కటేనని వడబోసి నిగ్గు దేల్చినాడు. 'చదువులలో మర్మమెల్ల చదివితిన'ని తేటపరచినాడు. అంతగా తేటపరిచినా తామసం ముదిరిన దైత్యనాథునికి అది అంతుపట్ట లేదు. సాత్త్వికులకు మాత్రమే బోధపడేవిషయం అది. ఆ మర్మం సాధుజన సంవేద్యం. అఖిల మునిజనహృద్యం. అది బ్రహ్మజ్ఞానం; ఆద్యం; అనవద్యం.

సమస్త విద్యలకు సారభూతమైన బ్రహ్మజ్ఞానాన్ని ప్రవచించే ఈ పద్యం పరమ వ్యావహారికజగత్తులో సైతం ప్రచలితంగా ఉంది. పరమార్థంలోనా? కానక్కరలేదు. మామూలు లౌకిక ప్రసంగాలలో కూడా.

*'ఎంతవరకు వచ్చింది నీ చదువు?' -ఒక ప్రశ్న*
*'చదువులలో మర్మమెల్ల చదివితి తండ్రీ' - తడుముకోకుండా సమాధానం.*

ఆ పంక్తికి అంతప్రాణ ముంది కాబట్టే ఇన్నేళ్ళుగా ఇన్నినోళ్ళుగా చలామణిలో ఉంది.

27. *బలయుతులకు దుర్బలులకు*
*బల మెవ్వఁడు, నీకు నాకు బ్రహ్మాదులకున్*
*బల మెవ్వఁడు, ప్రాణులకును*
*బల మెవ్వం డట్టి విభుఁడు బల మసురేంద్రా!*

అహంకారానికి ప్రతిరూపం హిరణ్యకశిపుడు. సౌజన్యస్వరూపం ప్రహ్లాదుడు. ఇద్దరి మధ్య పెద్ద వాదమే జరిగింది. 'నేను తప్ప ఇంకెవడు గొప్ప' అని తండ్రి పిడివాదం. 'అందరినీ మించినవాడు అపై నొక డున్నాడు' అని కొడుకు సంవాదం. 'ఎవని బలం చూసుకుని వాదిస్తున్నావు?' అంటే 'ఎవడు సృష్టికే కాదు సృష్టికర్తకే బలమో ఆ విభుడే నాకు బల'మని ఆ పరమ భక్తుని సమాధానం.

'బల' శబ్దం ప్రాసస్థానంలో మరీ మరీ రావడం ఈ పద్యానికి కొండంత బలం.

28. *కాననివాని నూఁతగొని కాననివాఁడు విశిష్టవస్తువుల్*
*గాననిభంగిఁ గర్మములుగైకొని కొందరు కర్మబద్ధులై*
*కానరు విష్ణు; గొంద ఱటఁగందు రకించిన వైష్ణవాంఘ్రి సం*
*స్థానరజో భిషిక్తులగు సంహృతకర్ములు దానవేశ్వరా!*

విష్ణువు సర్వాత్ముడు. జీవులు కర్మబద్ధులు. వెలుతురులో ఉన్నా చీకటిలోనే ఉంటారు. చూస్తున్నా మనుకుంటున్నా చూడలేని స్థితిలో ఉంటారు. 'కానని' అనే మాటను మూడు నాలుగుసార్లు ప్రయోగించి ఆ జీవుల అంధతను ఆజ్ఞతను నొక్కి చెప్పినాడు పోతన్న. మరికొందరున్నారు. వారు ఈ కొందరి వంటివారు కారు. సంహృతకర్ములు. భాగవతుల పాద ధూళితో పునీతులైనవారు. వారే విష్ణువును కనగలిగేవారు. కర్మబద్ధులకు విముక్తకర్ములకు ఉన్న భేదాన్ని తేటమాటలతో తెలిపిన పద్యమిది.

29. *ఇందుఁ గలఁ డందు లేఁ డని*
*సందేహము వలదు; చక్రి సర్వోపగతుం;*
*డెందెందు వెదకి చూచిన*
*నందందే గలఁడు దానవాగ్రణి! వింటే!*

'సర్వం విష్ణుమయం జగత్'. ఈ లోకమంతా విష్ణుమయమే. ఇది తెలుగునాట బాగా వాడుకలో ఉన్నమాట. ఈ పద్యానికి ఇదే పునాది. అయితే కట్టడంలో పోతన్న పనితనం కొట్టవచ్చినట్టు కనిపిస్తున్నది. మొత్తం పద్యాన్ని పిండితే చేతి కందే సారం చిటికెడే; – దేవుడంతటా ఉన్నాడు. 'చక్రి' 'సర్వోపగతుడు' 'దానవాగ్రణి' వంటి మూడు నాలుగు పదాలను తీసివేస్తే మిగిలే మాటలు 'ఇందులు' 'అందులు' 'ఎందెందులు' 'అందందులు'. ఈ బిందుపూర్వక 'ద'కారాల పొందికలే ఈ పద్యంలో పొదిగిన అందాలు. ఈ అందాల అల్లిక వల్లనే ఈ పద్యం నిత్యస్మరణీయంగా నిలిచిపోయింది.

ఇంకొక విశేషం ఉంది భగవత్పరంగా వ్రాయబడిన ఈ పద్యంలోని పరమార్థం అప్పుడప్పుడు మరుగున పడిపోవడం కూడా జరుగుతుంది. ఏ పెద్దమనిషో ఈపూట ఇక్కడుండి మరో గడియలో ఏ ఢిల్లీలోనో ఉంటే ఆ వార్తను విన్న తెలుగువాడు వ్యాఖ్యానిస్తాడు– 'అబ్బో; ఆయనకేం? ఇందు గలడందు లేదని సందేహము వల'దని.

ఎన్నో సందర్భాలలో నెమరు వేసుకోవడానికి ఉపయోగపడే పద్య పాదాలు పోతన్నవి. అందుకే అతడు 'ఇజం' ఎరుగని ప్రజాకవి.

*30. నన్నుఁ గన్న తండ్రి! నాపాలిదైవమ!*
*నా తపఃఫలంబ! నా కుమార!*
*నాదు చిన్న వడుగ! నా కులదీపక!*
*రాఁగదయ్య! భాగ్యరాశి వగుచు.*

ఇవి వామనుణ్ణి కన్న తల్లియైన అదితి మాటలే కానక్కరలేదు. ఏ తెలుగు తల్లైనా ఇలాగే అంటుంది. ఎద చేపిన వాత్సల్యంతో మూర్తి కట్టిన మాతృత్వంలో నడిచే ఈ పద్యానికి జీవం నన్ను 'గన్నతండ్రి' అనే అచ్చ తెలుగు పలుకుబడి.

కన్నకొడుకును కన్నతండ్రి అని పిలవడం తెలుగుభాషకు దక్కిన వరం.

*31. జో జో కమల దళేక్షణ!*
*జో జో మృగరాజమధ్య! జో జో కృష్ణా!*
*జో జో పల్లవ కరపద!*
*జో జో పూర్ణేందువదన జో జోయనుచున్.*

కందంలో అందంగా ఇమిడిన జోలపాట ఇది. 'జో అచ్యుతానంద జో జో ముకుంద' అనే జోలపాట పాటల్లో ఎంత పేరు మోసిందో, పద్యాల్లో ఇది అంత వాసి కెక్కింది. ఎందరెందరో తెలుగుతల్లులు ఇది పోతన్న పద్యమని తెలియకుండానే మనసారా పాడుకునేవారు; మాతృత్వ మాధుర్యాన్ని తనివితీరా అనుభవించేవారు.

ప్రాసస్థానంలో 'జో జో' అంటూ ఉండడంవల్ల, మధ్య మధ్య కృష్ణపరమైన ముచ్చటైన సంబోధన లుండడంవల్ల ఇటు రక్తికి అటు ముక్తికీ మూలకందమైంది-ఈ కందం.

32. *అమ్మా! మన్ను దినంగ నే శిశువునో? యాఁకొంటినో? వెఱ్ఱినో?*
*నమ్మంజూడకు వీరి మాటలు మది;న్న న్నీవు కొట్టంగ వీ*
*రి మ్మార్గమ్ము ఘటించి చెప్పెదరు; కాదేనిన్ మదీయాస్య గం*
*ధ మ్మాఘ్రాణము సేసి నా వచనముల్ దప్పైన దండింపవే!*

గోపాలకృష్ణుని బాల్యలీలలను వివరించే ఘట్ట మిది. ఒకనాడు చిన్ని కృష్ణుడు మన్ను తిన్నాడు. బలభద్రులు మొదలైన గోపకుమారులు యశోదకు ఈ విషయాన్ని చేరవేసినారు. 'ఒరే నాన్నా మన్నేటికి తిన్నావురా? తినడానికి మరే పదార్థం లేదా?' అని ఆ పిచ్చితల్లి అడుగగా ఆ చతురమూర్తి ఇలా అంటాడు- 'అమ్మా నేను పసివాణ్ణా? పిచ్చివాణ్ణా? వీళ్ళ మాటలను నమ్మకమ్మా. నన్ను కొట్టించడానికి ఎత్తువేసినారు. కాదంటావా? అయితే నా నోరు చూడు ఆఁ! తప్పయితే అప్పుడు దండించు'.

బలే ఎత్తువేసినాడు ఆ లీలా గోపాలుడు. 'అమ్మా మన్ను తినంగ నే శిశువునో' అంటాడు. నిజమే ఆతడా శిశువు? బ్రహ్మాండ భాండాలే ఆ అవతార పురుషుని కంటికి ఆటబంతులు. 'నేను వెఱ్ఱినా?' అంటాడు. నిజమే మరి! సమస్త జీవకోటులకు వెఱ్ఱెక్కించే సౌందర్యాభిరాముడు ఆ మహానుభావుడు. ఇంతకూ ఆ జగజంత యశోదమ్మకు తన ఈశ్వరత్వాన్ని చూపించాలని వేసిన ఎత్తది.

'నేను', 'శిశువునో', 'వెఱ్ఱినో' అన్న చిన్న చిన్న మాటల్లో పరమాత్మ తత్త్వాన్ని ధ్వనింపజేసినాడు పోతన్న.

*33. కలయో! వైష్ణవ మాయయో! యితర సంకల్పార్థమో! సత్యమో!*
*తలపన్నేరక యున్న దాననొ? యశోదాదేవిఁ గానో! పర*
*స్థలమో! బాలకుఁడెంత? యీతని ముఖస్థంబై యజాండంబు ప్ర*
*జ్వలమై యుండుట కేమి హేతువొ? మహాశ్చర్యంబు చింతింపఁగన్.*

అన్నట్టుగానే ఆ మన్నుదొంగ నోరు తెరువనే తెరిచినాడు. అనుకున్నట్టుగా ఆ వెర్రితల్లి చూడనే చూసింది. ఏమిటి?-మన్నేనా? అక్షరాలా. కానీ మరో రూపంలో - సముద్ర, పర్వత, భూగోళ, సూర్య, చంద్ర, దిక్పాలురతో కూడుకున్న బ్రహ్మాండరూపంలో - చూసింది; కృష్ణుని నోరు తెరిపించి చూసిన తానే నోరు తెరిచింది. ఎక్కడి బాలుడు? ఏమిటీ ఆశ్చర్యం? ఎక్కడి ముఖం? ఎక్కడి బ్రహ్మాండం? నిజమని ఎట్లా నమ్మేది? కల కావచ్చు. లేక వైష్ణవమాయ కావచ్చు. ఇంతకూ తాను యశోదాదేవి కాక పోవచ్చు. ముగ్ధ యశోద మనసులో సహజభాసురంగా చెలరేగిన తలపులవి.

ఈ అనుమానాల వెనుక పరమసత్యం దాగి ఉన్నది. యశోద పేరిట ఉన్న ఆ జీవికి నిజంగా అది కలయే. అవశ్యం అది వైష్ణవమాయయే. తాను 'యశోదాదేవిని కానేమో' అన్న ఊహలోనే ప్రాణిసహజమైన భ్రాంతియవనికను తొలగించినాడు పోతన్న. అద్భుతత్వం మిషతో ఆత్మావిష్కరణం కావించినాడు పోతన్న.

అయితే తనకొడుకు పరమేశ్వరుడని యశోద తలచింది క్షణకాలమే. తరువాత బోలెడు కథ జరుగవలసి ఉంది. అప్పటితో ఆ మాయ ముగిసింది. మళ్ళీ ఎప్పటి యశోదమ్మ. మామూలు గోపాలబాలుడు.

*34. ఓయమ్మ! నీకుమారుడు*
*మాయిండ్లను బాలు పెరుఁగు మననీఁడమ్మా!*
*పోయెద మెక్కడి కైనను;*
*మాయన్నలసురభు లాన! మంజులవాణీ!*

యశోదమ్మతో ఇరుగుపొరుగు గోపెమ్మల మొర ఇది. తమ ఇండ్లలో పాలూ పెరుగూ కాజేస్తున్నాడని; తాము ఎక్కడికైనా వెళ్ళిపోతామని వారి గోడు. ఎక్కడికి పోతారు? తమ అన్న లున్న చోటికి, అంటే పుట్టింటికి. ఆ పుట్టింటి మీద ఒట్టేసుకోవడంలో వాళ్ళు ఎక్కడికి పోదల్చుకున్నారో తెలుస్తుంది.

ఏముందీ పద్యంలో? 'ఓ యమ్మ నీ కుమారుడు' అని ఎత్తుకోవడంలో ఉంది. ఆ మొరను, వారి తొందరను సహజసంభాషణలో చిత్రించడంలో ఉంది.

ఏ అలంకారమూ లేకపోవడమే యీ పద్యానికి అలంకారం.

35 *మాటి మాటికి వ్రేలు మడిచి యూరించుచు*
*నూరుఁగాయలు దినుచుండు నొక్కఁ;*
*డొకనికంచములోని దొడిసి చయ్యన మ్రింగి*
*చూడు లేదని నోరు సూపు నొక్కఁ;*
*డేగు రార్గురి చల్దు లెలమిఁ బన్నిద మాడి*
*కూర్కొని కూర్కొని కుడుచు నొక్కఁ;*
*డిన్నియుఁదగఁ బంచియిడుట నెచ్చెలి తన*
*మనుచు బంతెనగుండు లాడునొకఁడు*

*కృష్ణుఁ జూడు మనుచుఁ గికురించి వరు మ్రోలి*
*మేలి భక్ష్యరాశి మెసఁగు నొకఁడు;*
*నవ్వు నొకఁడు; సఖుల నవ్వించు నొక్కఁడు;*
*ముచ్చటాడు నొకఁడు; మురియు నొకఁడు.*

చుట్టూ గోపబాలురు కూర్చున్నారు. మధ్యలో బాలకృష్ణు డున్నాడు. అందరూ కలసి నవ్వుతూ, తుళ్ళుతూ, ఇకిలిస్తూ, కికురిస్తూ తెచ్చుకొన్న చల్దులు తింటున్నారు. ఆ తినే తీరును, ఆ కుఱ్ఱవాళ్ళ హుషారును అప్పటికీ ఇప్పటికీ కళ్ళకు కట్టేటట్లు చిత్రించినాడు పోతన్న. ప్రతి పలుకుబడిని తూచి తూచి వేసినాడు. ఆ వ్రేలు మడిచి ఊరించడం, ఊరగాయలు తినడం, ఒకని కంచం లోనిది మరొకడు గబుక్కున మింగి 'చూడు లేద'ని నోరు చూపడం, పందెం కాచి ఐదారుగురు తినవలసిన బువ్వను పట్టించి, దట్టించి ఒక్కడే తినడం... ఓఁ ఎన్నెన్ని సరదా చేష్టలుఁ ఎంతటి స్వాభావిక చిత్రణంఁ

ఇప్పటి పిక్నిక్ వాతావరణానికి ఎప్పుడో బొమ్మకట్టి చూపినాడు ఆ సహజకవి.

*36. కర్ణాలంబిత కాక పక్షములతో గ్రైవేయహారాళితో*
*స్వర్ణభ్రాజితవేత్రదండకముతో సత్పింఛదామంబుతోఁ*
*బూర్ణోత్సాహముతో ధృతాన్నకబళోత్ఫుల్లాబ్జహస్తంబుతోఁ*
*దూర్ణత్వంబున నేగె లేఁగలకు నైదూరాటవీవీథికిన్.*

చల్దులు తినే సంబరంలో ఉన్నారు గోపకులు. పచ్చని గరికజొంపాల ముచ్చటకులోనై దూరదూరాలకు వెళ్ళిపోయినవి గోవులూ లేగలూ. ఆ లేగలను మళ్లించడానికి సాగిపోతున్న గోపాలమూర్తిని నయనాభిరామంగా చిత్రించినాడు పోతన్న.

కూర్చిన సమాసాలు, సమకూర్చిన మధురాక్షరాలూ రమణీయచిత్రణకు మారాకు హత్తినవి.

చెవులదాకా వ్రేలాడు కురులగుత్తులతో మెడలో మిలమిలలాడు రత్న హారాలతో, చేతిలో నిగనిగలాడు పుత్తడిబెత్తంతో, సిగలో కలకలలాడు నెమలి పింఛంతో, పూర్ణోత్సాహంతో పురోగమిస్తున్నాడు ఆ చిన్నారి గోపన్న. ఈ వర్ణనంతా ఒక ఎత్తు 'ధృతాన్న కబళోత్ఫుల్లాబ్జహస్తంబు'తో అన్న కొసరు మరొక ఎత్తు. ఈ గోపబృందం చల్దులు తినడం పూర్తికాకముందే గోబృందం వెళ్ళిపోయింది. 'మరేమీ తొందర లేదు. మీరు మీ సాపాటు కానియ్యండి నా పాటు నేను పడతాను' అని తినవలసిన అన్నపుముద్దను అరచేత పట్టుకొని బయలుదేరినాడు ఆ హొయలుకాడు.

నందనందనుని అలంకారాలకు వింతసొబగును కూర్చింది ఆ ఇంత అన్నపుముద్ద. మాటలా మరి మాధవభక్తుడైన పోతన్నకు కన్పడిన గోపాల కృష్ణుని నిసర్గరూపమిది.

*37. నల్లనివాఁడు పద్మ నయనంబులవాఁడు కృపారసంబు పై*
*జల్లెడువాఁడు మౌళిపరిసర్పితపింఛమువాఁడు నవ్వు రా*
*జిల్లెడుమోమువాఁడొకఁడు చెల్వలమానధనంబు దోచెనో*
*మల్లియలార! మీపొదలమాటున లేఁడుగదమ్మ! చెప్ప రే.*

పైకి ప్రణయ కలాపంగా కనిపించే గోపికాకృష్ణుల సంబంధం నిజానికి జీవాత్మపరమాత్మల అనుబంధం. గోపిక లెవరు? ఆ గోపాలచూడామణి ఎవరు? ఎందరో గోపికలు, ఒక్కడే కృష్ణుడు. ఇందరు గోపసుందరులు ఆ ఒక్క నల్లనయ్యను ఎందుకు

వలచినట్లు? వెర్రెత్తి పరిపరివిధాలుగా ఎందుకు పిలిచినట్టు? ఇంతకు వారి వయస్సెంత? గోపాలుని ప్రాయమెంత? స్థూలదృష్టికి పొరాడే ప్రశ్నలివి. సూక్ష్మదృష్టికి తళుకాడే సమాధానాలు వేరు.

ఆ కృష్ణుడు కేవలం గోపాలకృష్ణుడు కాదు అవతార పురుషుడు. చేరెడేసి కన్నులతో తలపై నెమలికుచ్చులతో, కరుణ వెదజల్లే చూపులతో, మరులూరించే నవ్వులతో తమ మానధనాన్ని దోచుకున్న శృంగారమూర్తే ఆ గోపాంగనలకు కనిపిస్తున్నది. కాని లోతుల్లోకి వెళితే ఆ 'నల్లనివాడు' నీలమేఘశ్యాముడు. ఆ "పద్మనయనంబులవాడు" పుండరీకాక్షుడు. ఆ "కృపారసంబు పై జల్లెడువాడు' అపారకరుణాసాగరుడైన శ్రీమన్నారాయణుడు. అతడు దోచినది "చెల్వల మాన ధనం" కాదు. వారి వ్యామోహగుణం, ఆ అల్లరిగోపాలు దేడని అడుగుతున్న దెవరిని? మాటా పలుకూ ఎరుగని మల్లెలను. అవి బదులుపలుకుతా యనే అడుగుతున్నారా వారు? కామార్తులకు ఏది చేతనం? ఏది జడం? ఎవరు చెప్పగలరు? ఆ కామార్తిలో - కడ ఎరుగని ఆ విభ్రాంతిలో - సలసల కాగిన జీవాత్మల ఆక్రందనానికి సుందరరాగ కల్పనం ఈ సురుచిరపద్యం.

ఈ పద్యం ప్రతి తెలుగువాని రసనాగ్రంపై కదలాడడానికి 'నల్లనివాడు' అన్న చల్లని తెలుగునుడి ఒక కారణం కాకపోదు.

మొదటిపాదంలో 'నల్లనివాడు' చివరిపాదంలో 'మల్లియలార' ఈ రెండు పదాలు ఈ పద్యమూర్తికి ఇరు భుజాలు.

*38. అదె నందనందనుం డంతర్హితుండయ్యెఁ*
*బాటలీతరులార! పట్టరమ్మఁ*
*హేలాపతులఁ గృష్ణ! యేల పాసితి వని*
*యైలేయలతలార! యడుగరమ్మ*
*వనజాక్షుఁడిచటికి వచ్చి డాఁగఁడుగదా*
*చూతమంజరులార! చూడరమ్మ!*
*మానినీమదనుతో మారాక యెఱిగించి*
*మాధవీలతలార! మనుపరమ్మ!*

*జాతిసతులఁ బాయ నీతియె హరి కని*
*జాతులార! దిశలఁ జాటరమ్మ!*
*కదళులార! పోయి కదలించి శిఖిపింఛ*
*జూటుఁ దెచ్చి కరుణఁ జూపరమ్మ!*

అందాకా తమతో కూడియాడి అంతలోనే మాయమైన మురళీలోలుణ్ణి అన్వేషిస్తున్నారు మదనవరవశలైన గోపికలు. మదిలో మదనుడు చొరబారితే కలిగే అవస్థలు ఇన్నన్ని కావు. కన్నెసిగ్గు కరిగిపోతుంది, మేని పన్నే తరిగిపోతుంది. ఏదీ రుచించదు. ఏ దిక్కూ తోచదు. ఏదేదో ఉన్మాదం, ఏమేమో ప్రలాపం. ఈ పద్యంలో ఉన్న మన్మథావస్థ ఆ ప్రలాపమే. మరుని తొందరలో ఓపికలు పోయిన గోపికలు విరహిణులై విహ్వలలై తరులనూ విరులనూ వల్లరులనూ మంజరులనూ అడుగుతున్నారు. 'ఏడి? తమ మానస చోరు డేడి?' అని. వారి ప్రలాపాన్ని, విరహాలాపాన్ని సహజరమ్యంగా చిత్రించినపద్యమిది. అయితే ఈ ఉన్మత్త ప్రలాపం కేవలం ఆంగిక సంక్షోభంవల్ల కలిగింది కాదు. పంచేంద్రియ తర్పణమే దీనికి పరమావధి కాదు. మధురభక్తిలో ఇది ఒక విచిత్రదశ. ఈ పిలుపు సమ్ముగ్ధచిత్తలైన ఆ గోపికల అంతరాత్మలకే మేలుకొలుపు.

39. *కిటి యై కౌఁగిటఁ జేర్చెను,*
*వటుఁడై వర్ధిల్లి కొలిచె వడిఁ, గృష్ణుండై*
*యిటఁ బదచిహ్న ములిడెఁ గ్రిం*
*దటిబాముస నేమి నోఁచితమ్మ! ధరిత్రీ!*

హరి వరాహమూర్తియై ధరిత్రిని కౌగిట చేర్చుకున్నాడు. వామనమూర్తియై బ్రహ్మాండాన్ని కొలిచినాడు. శ్రీ కృష్ణమూర్తి యై తన అడుగు జాడలతో పుడమిని పునీతం చేసినాడు. గతజన్మలో ధరాపురంధ్రి నోచుకున్న పుణ్యమది. గోపాలమౌళి పాదాలగుర్తులను కనుగొన్న గోపికల భావపరంపర ఇది. బేలలుగా అగుపించే గోపాంగనల నోట వాసుదేవుని మూలతత్త్వమే పలికింది. మూడు అవతారాలలోనూ భూరమణికి నారాయణునికీ ఉన్న సాంగత్యమే ఈ పద్యంలో ధ్వనించింది.

40. భూషణములు సెవులకు, బుధ
తోషణము, లనేకజన్మ దురితౌఘ విని
శ్శోషణములు మంగళతర
ఘోషణములు గరుడగమను గుణభాషణముల్

రుక్మిణీ కల్యాణ ఘట్టానికి తిలకంలాంటి పద్యమిది. ఈ తిలకం దిద్దుకున్న తర్వాతనే కథాకల్యాణి కదలాడుతుంది. గరుడగమనుని గుణగణ కీర్తనలు ఎంత విలువైనవో తెలుపుతుందీ పద్యం. అవి కర్ణభూషణములట. పండితులను అలరించేవట. అనేకజన్మల పాపాలను తొలగించేవట. కల్యాణప్రదములైన నినాదము లట.

ఈ పద్యంలో అర్థంకంటె శబ్దం, ఆ శబ్దరూపంకంటె అది పలికించే నాదం ముఖ్యమైనది. లాక్షణికదృష్టికి 'భూషణములు' 'తోషణములు' ఇత్యాది ప్రాసస్థానాలు త్రిప్రాసస్థానాలు త్రిప్రాసం కిందికో చతుష్ప్రాసం కిందికో వస్తాయి. కాని, ఇవి ఒకరకంగా వాక్యంచివర ఉండే అంత్యప్రాసస్థానంలో ఉన్నా అంత్యప్రాసల దరువుల్లాగ శ్రవణసుఖాన్ని కూర్చే కూర్పులివి.

ఇలాంటి పద్యాలు వ్రాయడం పోతన్నకు మామూలే. చెప్పదలచుకున్న వస్తువు చిక్కనిది కానప్పుడు మధ్య మధ్య ఇలాంటి ప్రాసక్రీడలకు లోనవుతుంటాడు. వాసుదేవుని గుణ భాషణములు వర్ణించాలని మనస్సు చెప్పింది. ఇంకేమి?' భాషణములు' అనే మాటకు సరితూగే పదాలు ప్రాసస్థానంలో తమంత తామే వచ్చి కుదురుకున్నవి– 'భూషణములు' 'తోషణములు' 'శోషణములు' 'ఘోషణములు' అంటూ.

ఈ పద్యాన్ని పిండితే వచ్చే అర్థం ఆవంత. చదివితే ఉదయించేనాదం కొండంత. పోతన్నకు పుట్టెడు పేరు తెచ్చిన గుణాల్లో ఈ అక్షరరమ్యత ఒకటి.

41. బంధువు లెల్లఁగృష్ణునకు బాలిక నిచ్చెద మంచు శేముషీ
సింధువులై విచారములు సేయఁగ వారల నడ్డుపెట్టి దు
స్సంధుఁడు రుక్మి కృష్ణునెడఁజాల విరోధముఁ జేసి మత్తపు
ష్పంధయవేణి నిత్తు శిశుపాలున కంచుఁ దలంచె నంధుఁడై

ఉదిత యౌవన యైన రుక్మిణి తన తండ్రి ఇంటికి వచ్చిపోయే అతిథులవల్ల కృష్ణుని అందచందాలను గూర్చి, శౌర్యసాహసాలను గూర్చి విన్నది. తనకు విభుడు అతడే అని నిశ్చయించుకున్నది.

అక్కడ హరి కూడా బాలామణి రుక్మిణి తనకు తగిన ఇల్లాలని అనుకున్నాడు. రుక్మిణి బంధువులందరూ ఈ ఆలోచనలోనే ఉన్నారు. వారు "శేముషీ సింధువులు" కాబట్టి.

అందరికీ అడ్డుపుల్లగా తయారైనాడు రుక్మిణి అన్న రుక్మి. ఆమెను శిశుపాలునికి కట్టబెట్టాలనే పన్నాగంలో ఉన్నాడు–అతడు అంధుడూ దుస్సంధుడూ కాబట్టి. ఈ అంధత్వం కంటికి సంబంధించింది కాదు; మతికి సంబంధించింది. అతని మతిని చీకటి ఆవరించింది. తామసం ప్రకోపించింది. తమో గుణ భూయిష్ఠునికి బుద్ధిమంతుల విచారాలు తలకిందులుగా కనిపిస్తాయి. అందుకే వాడు దుస్సంధు డయినాడు.

'సంధ' అంటే సంయోగం. రుక్మిణి కృష్ణుల సంయోగం లక్ష్మీనారాయణుల సంయోగం. ఇది సుసంధ. రుక్మిణిని శిశుపాలునికి కూర్చాలనే దృక్పథం దుస్సంధ. ఇది అయోగ్యం. తామసాంధుడైన రుక్మి దుస్సంధుడు గాక మరేమవుతాడు?

మూల భాగవతంలో 'అంధుడై' అనే మాటకు బదులు 'కృష్ణద్వేషి' అని ఉన్నది. కృష్ణద్వేషి అంటే ఆ ప్రత్యేకవ్యక్తిని దూషిస్తున్నవాడు. తెలుగులో 'అంధుడై' అనడంవల్ల రుక్మి సహజధూర్త ప్రకృతి బయటపడింది. "శేముషీ సింధువు" లనే మాట కూడా పోతన్న చేర్పే. "విచారములు సేయగా" అనేది ఈనాటికీ ఆ అర్థంలో వాడుకలో ఉన్న పలుకుబడి.

*42.* *ఏ నీ గుణములు కర్ణేంద్రియంబులు సోఁక*
*దేహతాపంబులు దీఱిపోవు;*
*నే నీ శుభాకార మీక్షింపఁ గన్నుల*
*కఖిలార్థలాభంబు గలుగుచుండు;*
*నే నీ చరణసేవ లేప్రొద్దు చేసిన*
*భువనోన్నతత్వంబుఁ బొందఁగలుగు;*
*నే నీ లసన్నామ మేప్రొద్దు భక్తి తోఁ*
*దడవిన బంధసంతతులు వాయు,*

నట్టి నీయందు నాచిత్త మనవరతము
నచ్చియున్నది; నీయాన; నాన లేదు;
కరుణఁ జూడుము కంసారిc ఖలవిదారిc
శ్రీయుతాకార! మానినీచిత్తచోర!

రుక్మిణి పంపిన పరిణయసందేశంలో ప్రథమపద్యమిది. కృష్ణుడు ఆ బాలామణి దృష్టికి కేవలం కంసారి, ఖలవిదారి మాత్రమే కాదు, శ్రీయుతాకారుడు; మానినీచిత్త చోరుడు కూడా. తాను మానిని, తన చిత్తమును ఏనాడో దొంగిలించినాడు ఆ శ్రీధరుడు. అతడు కేవలం గోపాలుడు కాదు, శ్రీపాలుడు. కన్నెగా ఉన్న రుక్మిణికి జన్మాంతర సంస్కారంవల్ల కైముత్యంలా భాసించిన సత్య మిది. అందుకే ఈ సంబోధనలను అంతబరువుగా ప్రయోగించింది. తన శరీరంలోని సర్వేంద్రియాలు సమస్తాణువులు అతని పొందుకొరకు తహతహలాడుతున్నాయని చాటులేని మాటలలో తేటపరచింది. 'నీ యాన, నాన లేదు' అని అన్నది. "నీ యాన" అంటే నీ తోడుసుమా! 'నాన' అంటే సిగ్గు, కన్యా సహజమైన సిగ్గును కూడా విడిచి కేలొగ్గి అడిగింది తనను కరుణించు మని, ఆతని రూపం చూస్తే కనులపండువట! అతని చరణాలను సేవిస్తే మహోన్నతి కలుగుతుందట! అతని పేరు తలిస్తే భవబంధాలు తొలగిపోతాయట! ఎవరీతడు? ప్రియుడేనా? కాదు, విశ్వమయుడు. తనకు కాబోయే వరుడేనా? కాదు; విశ్వేశ్వరుడు.

నవ విధ భక్తుల్లో నాలుగు భక్తిమార్గాలను ఈ పద్యంలో పొందుపరచినాడు పోతన్న. మొదటి పాదంలో శ్రవణం, రెండవ పాదంలో దర్శనం, మూడవ పాదంలో పాద సేవనం, నాలుగవ పాదంలో కీర్తనం. మొదటి రెండు పాదాలు మూలంలోనివే. తరువాతివి రెండు పోతన్న చేర్చినవి. నాలుగు పాదాలలో నాలుగు విధాల భక్తిపథాలను నిర్దేశించి ఆ శృంగాటకం మీద రుక్మిణిని అధిష్ఠింపజేసినాడు. ఇప్పుడు కనిపిస్తున్న రుక్మిణి బాలామణి మాత్రమే కాదు, మధురభక్తికి సంకేతంగా నిలిచిన మానినీశిరోమణి.

'ఏనీ' అని ఎత్తుకొని నాలుగు పాదాల వరకు నిర్వహించడంలో ఉంది. ఈ పద్యంలోని సగం అందం.

*43. ధన్యున్ లోకమనోభిరాముఁ గుల విద్యారూపతారుణ్య సౌ*
*జన్యశ్రీ బలదాన శౌర్యకరుణాసంశోభితున్ నిన్ను నే*
*కన్యల్ గోరరు? కోరదే మును రమాకాంతాలలామంబు రా*
*జన్యానేకపసింహ! నా వలననే జన్మించెనే మోహముల్?*

రుక్మిణి శ్రీకృష్ణుణ్ణి వలచింది. తాను వలచిన సంగతి సిగ్గువిడిచి పిలిచింది. అంతటితో ఊరుకోలేదు. తనకు కలిగిన మోహాన్ని ఒక చతురుడైన న్యాయవాదిలా సమర్థించడానికి పూనుకుంది. కృష్ణుని సకల సద్గుణాల పట్టిక నిచ్చింది. అబ్బబ్బ ఎన్ని గుణాలని! వంశం, విద్య, రూపం, యౌవనం, సంపద, శౌర్యం, దానం, దయ–ఇన్ని గుణాలు కలబోసినమూర్తిని ఏ కన్యలు కోరరు? అని ప్రశ్నించింది. 'నేను కోరుతున్నాను' అంటే చాలదా? ఎందరెందరో కోరుతున్నారు కాబట్టి తాను కోరుతున్నదా? ఏమిటీ వాదం? అతడు లోకాభి రాముడు కాబట్టి అందరూ కోరడం సహజం. వలచే ఆ కోటొక్క వనితల పంక్తిలోనేనా తనకు స్థానం? కాదు తొల్లిటిలక్ష్మితో తనకు సాజాత్యం ఉంది. నాడు లక్ష్మి వలచింది. అతడు శ్రీపతి అయినాడు. నేడు తాను వలచింది, అతడు రుక్మిణీపతి కాకతప్పదు. ముందు ఎందరో కన్యలకు కలిగిన వలపును ప్రస్తావించి, తరవాత ప్రత్యేకంగా లక్ష్మిని పేర్కొనడం రుక్మిణి చురుకుదనాన్ని సూచిస్తున్నది. వెన్నదొంగను వెర్రిమొర్రిగా వలచిన బేల కాదు రుక్మిణి, తాను అతన్ని జన్మ జన్మలకు ప్రేమించే సర్వస్వామ్యాలున్న సాక్షాత్ లక్ష్మీస్వరూపిణి.

ఈ పద్యంలో "రాజాన్యానేకపసింహ" అనేది సాభిప్రాయ సంబోధనం, రుక్మిణీ హరణంలో రణం తప్పదు. మత్తెక్కిన రుక్మి, శిశుపాలుడు మొదలైన రాజులు మదపు టేనుగుల్లా ఎదురుతిరుగుతారు. శ్రీ కృష్ణుడు వారి పాలిటి సింహమై విక్రమిస్తాడు. వారి గర్వాన్ని ఛేదిస్తాడు. ఇంతటి నిశ్చయం తనకుంది. అందుకే ఆమె సంబోధనలో జరుగనున్న కథ ధ్వనించింది.

*44. శ్రీయుతమూర్తి! యో పురుషసింహమ! సింహము పాలిసొమ్ము గో*
*మాయువు కోరు చందమునమత్తుఁడు చైద్యుడు నీ పదాంబుజ*
*ధ్యాయిని యైన నన్ను వడిఁదాఁ గొనిపోయెద నంచు నున్నవాఁ!*
*దాయధమాధముం డెఱుఁగఁడద్భుత మైన భవత్ప్రతాపముల్.*

కృష్ణుణ్ణి పదే పదే శ్రీపతిగా సంబోధించందే రుక్మిణికి తృప్తిలేదు. తనకు తెలియకుండానే తానే లక్ష్మిననే అభిప్రాయం ఆమె వాదనలో తొంగి చూస్తున్నది. అతడు పురుషసింహుడు. అంటే పురుషోత్తముడు. పురుషులెందరున్నా పురుషోత్తము డొక్కడే. అతడు శ్రీమన్నారాయణుడు. తాను అతని సొత్తు. తన జీవిత ధ్యేయం హరిచరణకమల ధ్యానం. అలాంటి తనను కొనిపోవాలనుకుంటున్నాడు శిశుపాలుడు. వాడు మత్తుడు, వాడి మత్తత ఒంటికి సంబంధించింది కాదు, ఊహకు సంబంధించింది. సింహంసొమ్మును గుంటనక్క కోరుకోవడం విపరీతం కాదు? శ్రీకృష్ణునికి అంకితమై తనను శిశుపాలుడు వాంఛించడం ఆ విపరీత బుద్ధివల్లనే. వాడు అధముడేకాదు, అధమాధముడు. ఈ మాటల్లో ఆ బాలమణి శక్తి స్వరూపిణిగా స్ఫురిస్తున్నది. ఎక్కడినుంచి వచ్చింది ఈమె కీసత్తువ? కేవలం ఆ పరమాత్మని పాదాంబుజధ్యానంవల్ల. శిశుపాలునిది కంటికీ ఒంటికీ పొరలు కప్పే తామసమార్గం. రుక్మిణిది కైవల్యమూర్తికి తనను తాను కానుకగా ఇచ్చుకున్న పరమసాత్త్విక పథం.

*45. ప్రాణేశ! నీ మంజుభాషలు వినలేని*
*కర్ణ రంధ్రంబులకలిమి యేల?*
*పురుషరత్నమ! నీవు భోగింపగా లేని*
*తనులతవలని సౌందర్య మేల?*
*భువన మోహన! నిన్నుఁ బొడగానఁగా లేని*
*చక్షురింద్రియములసత్త్వ మేల?*
*దయిత! నీ యధరామృతం బానఁగా లేని*
*జిహ్వకు ఫలరససిద్ధి యేల?*

*నీరజాతనయన! నీ వనమాలికా*
*గంధ మబ్బలేని ఘ్రాణ మేల?*
*ధన్య చరిత! నీకు దాస్యంబు సేయని*
*జన్మ మేల? యెన్ని జన్మలకును.*

రుక్మిణి దాస్యభక్తితోపాటు పోతన్న కవితాశక్తిని ప్రదర్శించే పద్యమిది. మానవ శరీరం పంచేంద్రియాల సంపుటి. చెవులున్నాయి వినడానికి. చేతులున్నాయి

తాకడానికి. కళ్ళున్నాయి చూడడానికి. జిహ్వ ఉంది రుచులానడానికి. నాసిక ఉంది వాసన చూడడానికి. ఇది సర్వప్రాణి సహజమైన లక్షణం.

కాని, రుక్మిణిదృష్టిలో పాంచభౌతికమైన తన శరీరానికి పరమావధి వేరు. ప్రాణేశ్వరుని సమాగమం, ఆ సమాగమం వల్ల కలిగే మహానుభవం తన పంచేంద్రియాల కలిమికి పరమార్థం.

ప్రాణేశుని మంజుభాషలు వినలేని తన కర్ణము లెందుకు? అతడు భోగించలేని తన తను వెందుకు? అతనిని చూడలేని తన కనులెందుకు? అతని అధరామృతం ఆనలేని తన జిహ్వ ఎందుకు? అతని వనమాలికాపరిమళం ఆఘ్రాణించలేని తన నాసిక ఎందుకు? అంతేకాదు, అతన్ని సేవించని తన జన్మమెందుకు?శరీర సాకల్యానికీ జన్మ సాఫల్యానికీ చేసిన మహోదాత్త సమన్వయ మిది.

పంచేంద్రియ సంపుటిలో పంచభూతాల గుణాలను ధ్వనింపజేయడం ఈ పద్యంలో ఉన్న రమణీయ రహస్యం. శ్రవణాలకు శబ్దగుణం, తనువుకు స్పర్శగుణం, నయానాలకు రూపగుణం, జిహ్వకు రసగుణం, నాసికకు గంధ గుణం సహజ లక్షణాలు. ఈ లక్షణ పంచకాన్ని సుకుమార వ్యంగ్య ధోరణిలో సూచించినాడు పోతన్న.

*46. కన్నియమీఁద నావలఁపు గాఢము; కూరుకు రాదు రేయి నా*
*కెన్నఁడు నా వివాహము సహింపక రుక్మి తలంచు కీడు; నే*
*మున్నె యెఱుంగుదున్; బరులమూఁక లడంచి కుమారిఁదెత్తు వి*
*ద్వన్నుత! మాను ద్రచ్చిన వహ్నిశిఖన్ వడిఁదెచ్చుకైవడిన్.*

రుక్మిణి పంపిన సుదీర్ఘ సందేశాన్ని విన్నాడు. అలవోకగా నవ్వుతూ మూడు ముక్కల్లో తన అభిప్రాయాన్ని వెల్లడించినాడు. తన మనసంతా ఆ కన్నియ పైనే ఉందన్నాడు. తనకు నిదురే లేదన్నాడు. రుక్మి వక్రబుద్ధి తనకు తెలుసు నన్నాడు. ఎవ్వ రెదురొడ్డినా తన మనోహరిణిని హరించి తెస్తానని ప్రతిజ్ఞ చేసినాడు. ఏ రకంగా? జమ్మికొయ్యలను రాచి హోమాగ్నిని సాధించినట్టుగా. చిన్న సెలయేరుగా ప్రారంభమైన ఈ పద్యం మహా జల పాతంగా పరిణమించింది. అందరు ప్రేమికులు అన్నట్టుగానే అన్నాడు కృష్ణుడు– "ఆ అమ్మాయిని నేను విపరీతంగా ప్రేమిస్తున్నాను. ఆమెను తలచుకోని గడియలేదు.

రాత్రుల్లో నిద్ర రావడం లేదు" అన్న ధోరణిలో, కానీ ప్రతిజ్ఞ చేసేసరికి అందుకు తగ్గ గంభీరమైన ఉపమానం వేసేసరికి పద్యం కొండంత పెరిగి పోయింది.

యజ్ఞానికి కావలసిన అగ్నిని జమ్మికొయ్యలను రాచి పుట్టిస్తారు. రుక్మిణి అలాంటి అగ్ని. రుక్మిణీహరణం యజ్ఞకార్యం వంటిది. ఈ పద్యానికి ప్రాణం ఈ అలంకారధ్వని.

"కూరుకు రాదు" అనేది తెలంగాణంలో ప్రచలితంగా ఉన్న పలుకుబడి.

47. *ఘనుఁడాభూసురుఁ డేగెనో; నడుమ మార్గశ్రాంతుఁడై చిక్కెనో;*
*విని కృష్ణుం డిది తప్పుగాఁ దలఁచెనో; విచ్చేసెనో; యీశ్వరుం*
*డనుకూలింపఁ దలంచునో తలఁపఁడో యార్యామహాదేవియున్*
*నను రక్షింప నెరుంగునో యెఱుగదో నాభాగ్య మెట్లున్నదో!*

రేపు లగ్నం. భూసురుడింకా తిరిగి రాలేదు. గోవిందు డేమన్నాడో తెలియదు. ధీరగా, గంభీరంగా కల్యాణ సందేశాన్ని పంపిన రుక్మిణి తడబడి పోతున్నది; తల్లడిల్లి పోతున్నది. చెప్పరాని ఆందోళన. ఎవరితోనూ చెప్పుకోలేని సందేహ పరంపర. లక్ష్మి అంశంతో పుట్టిన రుక్మిణికేనా ఈ సంశయాలు? "స్వామీ! పూర్వం నిన్ను రమాకాంతా లలామం కోరింది. ఈ జన్మలో నేను కోరుతున్నాను. ఇందులో నా తప్పేముంది?" అని తన సందేశంలో అంత నిక్కచ్చిగా చెప్పిన రుక్మిణి ఇంత ముగ్ధగా, సందిగ్ధగా ఎలా మారిపోయింది?

ఈ పద్యంలో రుక్మిణి లక్ష్మీ స్వరూపిణి కాదు. కేవల బాలామణి. కన్యా సహజమైన మోహం ఆవరించినప్పుడు అన్నీ సందేహాలే! చివరికి వెళ్ళవలసిన బ్రాహ్మణుడు వెళ్ళెనో లేదో అన్నంతదాకా సాగిపోయింది ఆ సందిగ్ధ చిత్తం. వలచిన హృదయంలోని ఆటుపోటులను సహజసుందరంగా చిత్రించిన పద్యమిది. ఇప్పటికీ మనలో సందేహాలు ముసురుకున్నప్పుడు ఈ పద్యం గుర్తుకొస్తుంది. అన్నీ ప్రశ్నలే ఉండడం ఈ పద్యంలోని మరొక విశేషం. అయితే మాంగల్యప్రదాయిని అయిన ఆ సర్వమంగళాదేవి సంస్మరణమే విపత్సాగర తరణంకాదా!

*48. నమ్మితి నామనంబున సనాతను లైన యుమామహేశులన్
మిమ్ముఁబురాణదంపతుల మేలుభజింతుఁగదమ్మ మేటి పె
ద్దమ్మ! దయాంబురాశివి గదమ్మ! హరిం బతి సేయుమమ్మ! నిన్
నమ్మినవారి కెన్నఁటికి నాశము లేదు గదమ్మ! యీశ్వరీ!*

నిన్నటి తరంవరకు తెలుగునాట కన్నెపిల్లలు భక్తి తాత్పర్యాలతో పాడుకున్న పద్య మిది. ఈ పద్యంలో ఉన్న జీవశక్తి ఆ భక్తి.

ఉమామహేశ్వరులు పురాణదంపతులు. అత్యంత సనాతులు. లక్ష్మీ నారాయణుల కంటె సనాతనులు. మహేశ్వరుని అర్థాంగి యైన మహేశ్వరి దయా జలధి. కల్యాణ సంసిద్ధికి సేవధి. రుక్మిణి ఈ పద్యంలో మొదట ఈ పురాణ దంపతులను కలిపి కైవారం చేసింది. పిదప ఆ చల్లనితల్లికి ప్రత్యేకంగా ప్రణమిల్లింది.

పారవశ్యానికి దారితీసిన భక్తిభావనం, దానిని అరటిపండొలచినట్లు ప్రకటించ గలిగిన పద సంకలనం ఈ పద్యానికి నయనయుగళం.

ఆయమ్మను 'అమ్మ' 'అమ్మ' అని ఐదుసార్లు సంబోధించడం ఈ పద్యం పొందిన ప్రాచుర్యానికి ప్రధాన కారణం.

*49. అళినీలాలకఁ బూర్ణచంద్రముఖి నేణాక్షిం బ్రవాళాధరన్
గలకంఠిన్ నవపల్లవాంఘ్రియుగళన్ గంధేభకుంభస్తనిన్
బులినశ్రోణినిభేంద్రయాన నరుణాంభోజాతహస్తిన్ మహో
త్పలగంధిన్ మృగరాజమధ్యఁ గని విభ్రాంతాత్ములైరందఱున్.*

గౌరీపూజకు వెళ్లుతున్న రుక్మిణిని ఘంటాపథంలో మూగిన రాజవీరులు కనుగొన్నారు. వీరందరూ ఆమెనే చూస్తున్నారు. ఆమె హరిరాకకు ఎదురు చూస్తూ నడుస్తున్నది. అలా నడుస్తుంటే ఆమె 'వీర మోహిని'ని చూస్తే ఇంకేమవుతారు? 'విభ్రాంతాత్ములైనా'రట. అంటే వారి మనసులే చెదరి పోయినాయన్నమాట! ఆమె సర్వాంగ సౌందర్యం వారి కనులకు మిరుమిట్లు గొలిపింది. ముందు వారికి తుమ్మెదరెక్కల వంటి కురులు కనిపించినవి. తరువాత పున్నమి చంద్రబింబంవంటి ముఖం కనిపించింది. ఆ తరువాత జింక కన్నులు పగడాల పెదవి, కలకంఠం, పాదపల్లవాలు, కుచకుంభాలు

ఇత్యాదులు. ఏమిటీ క్రమం? నిజమే! స్థూల దృష్టికి అలాగే కనిపిస్తుంది. కురులనుండి చరణాలవరకో, చరణాలనుండి కురులవరకో, వర్ణించవలసిందికదా! ఏమిటీ వ్యత్యాసం మరి? అక్కడే పోతన్న సాధించిన ఔచిత్యం పరాకాష్ఠ నందుకున్నది. చూసేవారు విభ్రాంతులు, మతి చెదరినవారు, ఉన్మాదం ముదిరినవారు. ఆ జగన్మోహిని దుర్నిరీక్ష్య సౌందర్యాన్ని ఒక క్రమంలో చూడగలుగుతారా? ఈ దృష్టి ఉంది గనుకనే పోతన్న రెండు సాభిప్రాయపదాలు ప్రయోగించినాడు. ఆమె 'వీర మోహిని' అని, వారు 'విభ్రాంతాత్ము'లని.

*50. మాసరివాఁడవా మాపాపఁ గొనిపోవ;*
*నేపాటిగలవాఁడ; వేది వంశ;*
*మెందు జన్మించితి; వెక్కడఁ బెరిఁగితి;*
*వెయ్యది నడవడి; యెవ్వఁడెఱుఁగు*
*మానహీనుఁడ నీవు; మర్యాద లెఱుఁగవు;*
*మాయఁ గైకొనికాని మలయరావు;*
*నిజరూపమున శత్రునివహంబుపైఁ బోవు*
*వసుధేశుఁడవు గావు; వావిలేదు;*

*కొమ్ము నిమ్ము: నీవు గుణరహితుండవు;*
*విడువు; విడువదేని విలయకాల*
*శిఖిశిఖా సమాన శితశిలీ ముఖముల*
*గర్వమెల్లఁ గొందుఁ గలహమందు.*

రుక్మిణిని ఎత్తుకుపోతున్న కృష్ణుణ్ణి అదలించి తూలనాడుతున్నాడు రుక్మి. అతని కులాన్నీ గుణాన్నీ పేరు పేరున ఎంచి దుయ్యబడుతున్నాడు. పైకి చూస్తే అన్నీ నిందలే. రుక్మి నిందలు తప్ప అభినందనలు చేసేవాడా మరి? ఒక దుష్టపాత్ర విశిష్టరక్షకుణ్ణి చెడా మడా తిడుతుంటే పాపం మన పోతన్న పులుకు పులుకు చూస్తాడు; 'అయ్యో! నా స్వామి తిట్లపాలౌతున్నాడే' అని ఆందోళనపడుతాడు. ఆ దుష్టునికి తెలియకుండానే వాడి పాదునోట పరతత్త్వరహస్యాలను పలికిస్తాడు. ఆ రకంగా తన మనసు నింపుకుంటాడు. ఈ పద్యంలో ఆ పనే చేసినాడు. అటు కృష్ణుడు ఇటు రుక్మి. ఇక తిట్లవెనుక దాగిన పరమార్థమేమిటో చూద్దాం.

కృష్ణుడు రుక్మికి 'సరివాడు కాడు' – నిజమే! అందరికీ అతీతుడు. అతడు ఏపాటి గలవాడు? – ముల్లోకాలే అతనివి. ఆ సిరియే అతనిది. ఏది వంశం – విష్ణుమూర్తికి ఒక వంశ మంటూ ఉంటుందా? ఎందు జన్మించితివి? – జన్మలేనిదే.

ఎక్కడ పెరిగితివి? – పెరుగుట విరుగుట నరులకు. నారాయణుని కెక్కడిది?

ఎయ్యది నడవడి? – నడిపించేవాని నడవడి ఎవడెరుగును? మానహీనుడవు – అశరీరునికి, ఆత్మస్థిరునికి మానప్రసక్తి ఏది? మర్యాద లెరుగవు- అనంతు డతడు. మాయ గైకొనిగాని మలయరావు- సర్వమూ ఆతని మాయే, నిజరూపమున శత్రు నివహంబుపైఁ బోవు- అన్ని రూపాలు అతనివే. వసుధేశుడవు కావు నిజమే! ఒక్క వసుధకే కాదు, చతుర్దశ భువనాలకే అధీశ్వరుడు.

వావి లేదు–త్రివిక్రమునికి క్రమంతో నిమిత్తం లేదు. గుణ రహితుండవు – గుణత్రయము జీవకోటికి. గుణాతీతుని కేటికి?

ఇది–పైన నిందగా కనిపించినా లోన స్తుతిని దాచుకున్న పద్ధతి. అలంకారాలలో వ్యాజస్తుతి.

*51. తగు నీ చక్రి విదర్భ రాజసుతకున్, దథ్యంబు, వైదర్భియుం*
*దగు నీ చక్రికి, నింతమంచి దగునే దాంపత్య, మీయిద్దఱిం*
*దగులంగట్టిన బ్రహ్మ నేర్పరిగదా! దర్పాహతారాతియై*
*మగఁ డౌఁ గావుతఁజక్రి యీరమణికిన్ మా పుణ్యమూలంబునన్.*

హరిని చూచిన విదర్భ పౌరులు అనుకున్నారట, – కృష్ణునికీ రుక్మిణికీ బలేజంట కుదిరిందని. ఆ అనుకోవడంలో స్వచ్ఛమైన అమాయికత్వం ఉంది. మంగళకరమైన ఆకాంక్ష ఉంది. కృష్ణునికి రుక్మిణి, రుక్మిణికి కృష్ణుడు అన్ని విధాలా తగినవారు. ఈ ఇద్దరినీ తగులగట్టిన బ్రహ్మ నేర్పరియట. ఈ తగుల గట్టడం అనేది పోతన్న సరికొత్తగా కూర్చిన నుడికారం. ఈ మాటకు ఇటీవలి కాలంలో ఉన్న అర్థం వేరు. ఇష్టంలేని సంబంధాన్ని 'తగులు' 'తగులం' అంటే ఆసక్తి, అనురాగం. ఆ ఇద్దరి హృదయాలలో ఒకరిపట్ల ఒకరి తగులం ఏర్పడింది. ఈ రాగబంధాన్ని ఎరిగిన బ్రహ్మ వారి వివాహబంధాన్ని ఏనాడో నిర్ణయించినాడు. అందుకే అతడు బ్రహ్మ. ఆ నేర్పు అతనికే

చెల్లింది. సామాన్యపౌరులు అమాయికంగా పలికిన పలుకుల వెనుక ఇంతటి గంభీరార్థాన్ని పొదిగినాడు పోతన్న.

ఈ పద్యంలో కృష్ణుడు మాటిమాటికి చక్రిగా కనిపిస్తాడు. రుక్మిణి వైదర్భిగానే భాసిస్తుంది. పర్యాయపదాలు కరువా, తిప్పితిప్పి గుప్పించడానికి పదే పదే చక్రి చక్రి అంటా దేమిటి? అప్పుడు కావలసిందీ, అక్కడికి రావలసిందీ గోపాలబాలుడో, మురళీలోలుడో కాదు, చక్రధారి యైన సర్వేశ్వరుడు. వచ్చింది తా వలచిన ఒక సామాన్యకన్యకోసం కాదు, విదర్భరాజు పుత్రికకోసం. మరో రూపంలో పెరుగుతున్న రమాభగవతి కోసం. అందుకే పోతన్న అన్ని సార్లు కృష్ణపరంగా చక్రిని; రుక్మిణీవరంగా 'వైదర్భి'ని ప్రయోగించినాడు.

*52. ధ్రువకీర్తిన్ హరి పెండ్లి యాడె నిజచేతోహారిణిన్ మానవై*
*భవగాంభీర్యవిహారిణిన్ నిఖిలసంపత్కారిణిన్ సాధుబాం*
*ధవ సత్కారిణిఁ బుణ్యచారిణి మహాదారిద్ర్యసంహారిణిన్*
*సువిభూషాంబరధారిణిన్ గుణవతీ చూడామణిన్ రుక్మిణిన్.*

ఇది రుక్మిణీకృష్ణుల కల్యాణం. అంత్యప్రాసలదొంతరతో పోతన్న చేసిన కావ్యగానం. అతడు హరి. ఆమె చేతోహారిణి. ఈజన్మలోనే కాదు అతని హృదయాన్ని హరించినది, ఆనాడే-సంపత్కారిణిగా, ఇందిరాసుందరిగా అతనిని చేపట్టిననాడే. ఆ దంపతులే ఈ దంపతులు. ఆనాటి పెండ్లి క్షీర సాగర తీరంలో జరిగింది. రుక్మిణీ కృష్ణుల కల్యాణం అఖిల భువనకల్యాణం.

చుట్టూరా ఆవరించుకొని ఉన్న చీకటిని
తిట్టుకుంటూ కూర్చోవడం కంటే ప్రయత్నించి
ఎంత చిన్న దీపాన్నైనా వెలిగించటం మంచిది
అన్న వాక్యమే మా యువభారతికి ఊపిరి.



# యువభారతి పరిచయం

యువభారతి, సాహితీ సాంస్కృతికసంస్థ, 1963లో విజయదశమి శుభదినాన స్థాపించబడిన నాటి నుండి సమాజంలో సామరస్యాన్ని పెంపొందించేందుకు సాహిత్యం కంటే ఇతర సాత్త్విక సాధనం లేదనే విశ్వాసంతో తెలుగు భాషాభివృద్ధికై ఇతోధిక కార్యక్రమాలను రూపొందించి కృషి చేస్తున్నది. "చుట్టూరా ఆవరించుకొని ఉన్న చీకటిని తిట్టుకుంటూ కూర్చోవడంకంటే ప్రయత్నించి ఎంత చిన్న దీపాన్నయినా వెలిగించడం మంచిది" అన్న లక్ష్యంతో సమాజంలో వ్యష్టిగా, సమష్టిగా శాంతియుత సహజీవనాన్ని ప్రజాస్వామ్య విధానాన్నీ, నిర్మాణాత్మక కార్యశీలాన్ని, మానవతా విలువలతో కూడిన సేవాభావాన్ని ఆచరించి చూపిస్తోంది యువభారతి. తెలుగు సాహితీ రంగంలో బలమైన ప్రయోగాలు చేసి తెలుగు ప్రజల మన్ననలను పొందింది.

- ✧ నేటి యువతలో ఆత్మ విశ్వాసం కలగాలనే సత్సంకల్పంతో, గత పది సంవత్సరాలుగా నగర కేంద్ర గ్రంథాలయం, అశోక్‌నగర్, హైదరాబాద్ వారి సౌజన్యంతో, 'వ్యక్తిత్వవికాసం'పై ఉచిత తరగతులను నిర్వహిస్తున్నది. యువభారతి సమావేశకర్త ఆచార్య వంగపల్లి విశ్వనాథంగారి ఆధ్వర్యంలో ఈ కార్యక్రమం నిర్వహించబడుతోంది.
- ✧ యువభారతి ప్రతి నెలా మూడవ ఆదివారం మధ్యాహ్నం 2-00 గం॥ల నుండి సాయంత్రం 5-00 గం॥ల వరకు సభ్యులలో అంతర్లీనంగా, నిక్షిప్తంగా ఉన్న ప్రతిభను వెలికితీసి వ్యక్తి పరిపూర్ణ వికాసానికి దోహదం చేసే, వివిధ రకాలైన "కమ్యూనికేషన్ స్కిల్స్"ని పెంపొందించేందుకుగాను 'ప్రతిభ' పేరున రూపొందించి ఒక కార్యక్రమాన్ని నిర్వహిస్తోంది. ఈ కార్యక్రమంలో పాల్గొని, మీ "కమ్యూనికేషన్ స్కిల్స్"ని అభివృద్ధి పరచుకునే అవకాశం లభిస్తుంది. యువతీ యువకులు ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోవలసిందిగా కోరుచున్నాం. స్థలం: శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయం, సుల్తాన్‌బజార్, కోఠీ, హైదరాబాద్.
- ✧ ఏ సంస్థ భవితయినా యువత మీద ఆధారపడి ఉంటుందన్నది జగమెరిగిన సత్యం. మనకు వారసత్వంగా వస్తున్న భాష, సాహిత్యం, సంస్కృతి, సంప్రదాయాలను తరువాతి తరానికి అందించే గురుతర బాధ్యత నేటి యువతరంపై ఉంది. అందుకని నేటి యువతరాన్ని 'యువభారతి'లో సభ్యులుగా చేరి, మా కార్యక్రమంలో విరివిగా పాల్గొని మా యీ సాహిత్యోద్యమాన్ని భావితరాలకి అందేలా చూడమని మనసారా ఆహ్వానిస్తున్నాం.




# యువభారతి ఫౌండేషన్

పరిచయం: "చుట్టూరా ఆవరించుకొని ఉన్న చీకటిని తిట్టుకుంటూ కూర్చోవడంకంటే, ప్రయత్నించి ంత చిన్న దీపాన్నయినా వెలిగించడం మంచిది" అన్న వాక్యమే ఊపిరిగా 1963లో జయదశమినాడు యువభారతి సాహితీ సాంస్కృతిక సంస్థ ఆవిర్భవించింది.

యువభారతి పరిచయం: ఉత్తమ సాహిత్యాధ్యయనం సమాజంలో సామరస్యాన్ని పెంపొందిస్తుంది. నిషిలో అంతర్లీనంగా, నిక్షిప్తమయిన ప్రతిభను వెలికి తీస్తుంది. సాత్వికతను పెంపొందించి, గటు మనిషిని 'మనీషి'గా తీర్చిదిద్దుతుంది. అన్నది యువభారతి నమ్మకం. ఈ ఆశయ సాధనకు డచిన 45 సంవత్సరాలుగా అనేక సాహితీ, సాంస్కృతిక కార్యక్రమాలను నిర్వహించి, 'లహరీ' పన్యాస పరంపరలనేర్పాటు చేసి, ఉన్నత ప్రమాణాలుగల అనేక గ్రంథాలను ప్రచురించి, లుగువారి హృదయాలలో సుస్థిర స్థానాన్ని పొందింది.

యువభారతి ఫౌండేషన్: మీరందించిన ఈ స్థానాన్ని పదిలపరచుకొని, తెలుగు భాష, సాహిత్య, ంస్కృతులను మరింత అభివృద్ధి పరచి, తెలుగువారిలో మాతృభాషాభిమానాన్ని పెంచి, వారిని త్తమ పౌరులుగా తీర్చి దిద్దడానికి ఒక శాశ్వత నిధినేర్పాటు చేయాలని భావించి, యువభారతి త్రులతో కలిసి, "యువభారతి ఫౌండేషన్" పేర ఒక శాశ్వత నిధిని ఏర్పాటు చేయడం జరిగింది.

మీ వంతు సహకారాన్ని మీరెలా అందించగలరు?

మీరు ఈ మా ఉద్యమంలో పాలుపంచుకోవాలనుకుంటున్నారా? అయితే మీవంతు సహాయ సహకారాలు మీరీ కింది విధంగా మాకు అందచేయవచ్చు.

- మీరు సాహితీవేత్తలు, తెలుగు భాషాభిమానులు అయితే మీ చక్కని సూచనలను, సలహాలను, మాకందించి మా కార్యక్రమాల రూపకల్పనలో మీ వంతు సహకారాన్ని మా కందించవచ్చు.
- మీరు "మాతృభాష" పై అభిమానం కలవారైతే మీ అమూల్యమైన సమయంలో కొంత సమయాన్ని "యువభారతి ఫౌండేషన్" కార్యకలాపాలనిర్వహణలో వెచ్చించి, మాతో సహకరించవచ్చు.
- మీరు ఉద్యోగ వ్యాపారాలలో తీరికలేని వారైతే "యువభారతి ఫౌండేషన్"కు విరివిగా విరాళాలనందించి ప్రోత్సహించవచ్చును. మీరిచ్చే ఎంత చిన్న మొత్తాన్నైనా, "యువభారతి ఫౌండేషన్" వినమ్రంగా స్వీకరిస్తుంది.

**యువభారతి ఫౌండేషన్**

ఇ.నెం. 3-6-207/1, మక్దూం మార్గం, 15వ వీధి, హిమాయత్ నగర్,
హైదరాబాద్- 500 029. సెల్: 9247 328 440.

తెలుగు సాహితీవేత్తలు, భాషాభిమానులు, తల్లులు, తండ్రులు, గురువులు, అధికారులు, అనధికారులు, విద్యార్థులు, యువతీయువకులు యావన్మంది తెలుగువారు తమ భాషాభిమానాన్ని ప్రదర్శించి, "యువభారతి ఫౌండేషన్" కార్యక్రమాలకు తమ హార్దిక, ఆర్థిక సహాయ, సహకారాలను అందించి ప్రోత్సహిస్తారని ఆశిస్తున్నాం

యువభారతి ఫౌండేషన్ తరపున

| | | |
|---|---|---|
| ఎ.నాగేశ్వరరావు | ఎ. రామలింగేశ్వరరావు | డా. వంగపల్లి విశ్వనాథం |
| కోశాధికారి | మేనేజింగ్ ట్రస్టీ | అధ్యక్షుడు |